# భక్తి సంగీత వరివస్య

**(ప్రథమబహుమతి పొందిన వచనరూపకం)**

రచన

**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య,**

M.A., M.Com., M.Phil., Ph.D.,

**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**

16-6-81 శ్రీనివాస అగ్రహారం

నేతాజి పైలట్ స్కూల్ ప్రక్కన, నెల్లూరు - 524 001, ఆం.ప్ర.

ఈమెయిల్: tekumalla.venkatappaiah@gmail.com

ఫోను: 9490400858, 91105 80418







# భక్తి సంగీత వరివస్య

**(వచన రూపకం)**

**రచన**: డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

**ప్రతులు :** 500 కాపీలు

**ముద్రణ :** ప్లవ - శ్రావణ
సెప్టెంబర్ - 2021

**మూల్యం:** రూ. 25/-

**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**
3 వ మెయిన్ రోడ్డు
16-6-81 శ్రీనివాస అగ్రహారం
విజయమహల్ దగ్గర
నేతాజి పైలట్ స్కూల్ ప్రక్కన
**నెల్లూరు - 524 001, ఆం.ప్ర.**
**ఈమెయిల్:** tekumalla.venkatappaiah@gmail.com
**ఫోను:** 9490400858, 91105 80418

**ప్రచురణ/ముద్రణ : డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య,** నెల్లూరు - 524 001.

**సహకారం:** డా. వాస భూపాల్, కవి, రచయిత
సూర్యాపేట్ (99490 37616)

డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

# నాంది

ఈ రూపక రచనకు నేపథ్యం చెప్పవలసి యున్నది. శ్రీ వీర నరసింహరాజు తిరుపతి వాస్తవ్యులు, జూలై 2021 లో ముఖపుస్తకంలో ఒక పోటీ నిర్వహించారు. దానిలో వారు "పదకవితా పితామహుడు అన్నమయ్య (1408-1503), వ్యాసరాయ తీర్థ (1460-1539), దాస సంగీతానికి ఆద్యుడు పురంధర దాసు (1484-1564) వీరిలో వ్యాసరాయ తీర్థ మరియు అన్నమాచార్య ప్రథమంగా చంద్రగిరి కోటలో సాళ్వ నరసింగ రాయల కొలువులోనూ తరువాత తిరుమలలో శ్రీనివాసుని సన్నిధిలో ఒకరిని ఒకరు కలిశారు. ఇంక పురందర దాసులవారు, అన్నమాచార్యుల వారిని తిరుమల శ్రీవారిదర్శనం కోసం వచ్చినపుడు దర్శించారు. ఇవి అపురూప చారిత్రిక ఆధ్యాత్మిక సౌరభాలను వెదజల్లిన ఘటనలు. వారు కలసినపుడు ఆనాడు ఏమేమి చర్చించారో తెలియదు గానీ ఈ చారిత్రిక కలయికను ఊహిస్తూ ఓ చిన్నరచన చేయమని కోరుతున్నాను. నగదు బహుమతులు ఇవ్వబడును" అని ప్రకటించారు. ఆ ప్రకటనే ఈ రచనకు నాంది..పునాది..నేపథ్యం.

శ్రీ వీర నరసింహరాజు గారికి ఈ ఆలోచన ఎందుకొచ్చిందో తెలియదు. సుమారు 500-600 సంవత్సరాల క్రితం దక్షిణాపథంలో సమకాలీనులై వెలసి, కర్ణాటక సంగీతానికి బీజాలు వేసి, భజన సంప్రదాయానికి పాదులు తీసిన అన్నమయ్య, శ్రీపాదరాయలు, వ్యాసరాయ తీర్థులు, పురందర దాసు వంటి కవి పండితులను, వాగ్గేయకారులను, మీదుమిక్కిలి కర్ణాటక సంగీత పితామహుణ్ణి, ప్రథమాంధ్ర వాగ్గేయ కారుణ్ణి తలచుకోవడమే కాకుండా అలాంటి గొప్ప వాగ్గేయ కారులు ఒకరికొకరు పరస్పరం కలుసుకున్నప్పుడు ఏమి మాట్లాడుకొని ఉంటారు అన్న తలంపుతో వ్యాసం రాయమని దానికి బహుమతులు ఉంటాయని ప్రకటించడం ముదావహం.

అయితే ఇక్కడే వచ్చింది పెద్ద చిక్కు. వాగ్గేయకారుల కీర్తనలు అడపా దడపా విని ఉండవచ్చు. కానీ వారి సాంఘిక, రాజకీయ జీవితాలు అనుశ్రుతంగా







వస్తున్న వింటున్న కథలు, చిన్నన్న వంటి మహానుభావులు అన్నముని చరిత్ర వ్రాయడం, సినిమాలలో చూడడం తప్ప వారి జీవిత చరిత్రలు వ్యక్తిగత జీవితాల్లో జరిగిన సంఘటనలు ఆ పరంధాముడికే ఎఱుక.

రాజు గారు కోరినదానిలో "వారు (వాగ్గేయకారులు) కలసినపుడు ఆనాడు ఏమేమి చర్చించారో తెలియదు గానీ ఈ చారిత్రిక  కలయికను ఊహిస్తూ ఓ చిన్నరచన చేస్తే ఎలా ఉంటుంది అన్న ఆలోచన వచ్చింది. ఈ మహోన్నత చారిత్రాత్మక పరిశోధనాత్మక కల్పిత గాథకు శ్రీకారం చుట్టి  మహోన్నత సన్నివేశాలకు ప్రాణం పోయండి" అన్నారు. నాకు ప్రాణప్రదమైన అన్నమయ్యను గురించి అడిగితే వ్రాయకుండా ఉండగలనా? అన్నమయ్యంటే ఏదో వ్రాయవచ్చు కొంత తెలుసు కాబట్టి. పురందాసు గురించి కీర్తనల గురించి తెలుసు కాబట్టి ఏదో ఊహా పరికల్పన చేయ వచ్చు. మరి ఈ శ్రీపాదరాయలు, వ్యాస రాయ తీర్థులు ఎవరు? పేర్లు వినడం తప్ప పూర్తిగా ఆలోచనలలో లేని వ్యక్తులు. దీనికి భౌగోళిక, సాంఘిక, చారిత్రక పరిజ్ఞానం చాలా అవసరం.

ముఖ్యంగా వీరి కాలాదులు, దేశ మాన కాల పరిస్థితులు అవగాహనకు రావాలి. చర్చకు తీసుకున్న విషయాలు అవాస్తవాలైనా, వాస్తవాలైనా ఒక సత్యప్రాతిపదిక ఉండాలి. ఉదాహరణకు విప్రనారాయణ సినిమాలో జయదేవుని "సావిరహే" అన్న కీర్తన ఉన్నట్టు ఉండకూడదు కదా! 'విప్రనారాయణ' లేక 'తొండరదిప్పొడి ఆల్వార్' జీవించినది 8వ శతాబ్దము, జయదేవుడు 12వ శతాబ్దము. 8వ శతాబ్దం నాడే జయదేవుని కీర్తనలు ఎలా ప్రాచుర్యంలో ఉంటాయి అని ఆరోజుల్లో అనుకున్నారు (ట). అలాంటి అసంబద్ధమైన విషయాలకు, అవాస్తవాలకు తావివ్వకుండా.. అలా అని వ్యర్థ ప్రసంగం కాకుండా విజ్ఞానాత్మ కంగా, ఆలోచనాత్మకంగా, తార్కిక నిబద్ధతతో వ్రాయవలసి ఉన్న గొప్ప బాధ్యత గా భావించి ఈ ప్రాజెక్టు తీసుకోవడం జరిగింది. ఏ పని చేసినా నిబద్ధతతో చేయాలన్న ఆలోచన వున్న వాణ్ణి.   మాట్లాడుకున్నారని కాకుండా వారి వారి స్థాయిలో చర్చకు వచ్చిన లేక సంభాషించుకొన్న అంశాలు ఏముంటాయనే ఎరిక  రచయితకు  రావడం ప్రధానమైన విషయం గా భావిస్తున్నాను.

డా. టేకుమళ్ళ  వెంకటప్పయ్య

ఇది చారిత్రాత్మక పరిశోధనాత్మక వ్యాసం అనే స్పృహ ఆసాంతం రచయితకు ఉండి తీరాలి. దీన్ని రాజుగారు "వ్యాసరూపం" వ్రాయమని కోరినప్పటికి నేను స్వతంత్రించి మూడు దృశ్యాల "రూపకం"గా వ్రాశాను. దానికి కారణమేమంటే.. వ్యాసానికి రూపకానికి ఉన్న తేడా మనం గమనించవలసిన అగత్యం ఉంది. ఒక విషయాన్ని వివరంగా విస్తరించి రాయటమే వ్యాసం. వ్యాస రచన జ్ఞానానికి, సృజనశక్తికి, తార్కికతకు అద్దం పడుతుంది. దీనికి ప్రారంభం, నిర్వచనం లేదా వివరణ లేదా నేపథ్యం, విషయ విశ్లేషణ, అనుకూల, ప్రతికూల అంశాలు, సూచనలు, ముగింపు ఇలా విభజించి రాయడం ఉండాలి. కానీ రాజు గారి ప్రధానోద్దేశం ఏమంటే "చారిత్రక ఘటనకు సన్నివేశ 'రూపకల్పన' చేస్తే ఎలా ఉంటుంది" అన్న తలంపు. అది సఫలీకృతం కావాలంటే.. "రూపకల్పన" అనేదాన్ని, ఒక రూపకంలా రూపకల్పన చేస్తే పాత్రలు పరిమితమే కాబట్టి ఇబ్బంది ఉండదు. ఇంకా వ్యాసంలో అన్నమయ్య ఇలా అన్నాడు..పురందర దాసు ఇలా అన్నాడు..అని క్వొటేషన్లో వ్రాయ వలసి ఉంటుంది. అదేదో రూపకంగానే నడిపిస్తే రసవత్తరంగా ఉంటుందని భావించాను.

ఇలా మొదలైన నా రూపక ప్రయాణం ఎలా నడిచిందనే విషయం ప్రస్తావనలో వివరంగా తెలియజేస్తాను.

- **డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య**





# ప్రస్తావన

ఈ రూపకల్పనలో "భక్తి-సంగీతం" రెండే ప్రధానాంశాలు. ఈ రెండిటిపైనా శ్రద్ధ పెట్టినప్పటికి అక్కడక్కడా చారిత్రక, రాజకీయ సంఘటనలు కూడా..అవసరం మేరకు సూచన ప్రాయంగా చూపించడం జరిగింది. అన్నమయ్య ఒక విశిష్టాద్వైతి. శ్రీపాద, వ్యాసరాయ పురందరులు మధ్వాచార సంపన్నులు.. ద్వైతులు. చరిత్ర పరిశీలించిన మీదట అందరూ పరమత సహనం కలిగిన వారనే చెప్పుకోవచ్చు. 12వ శతాబ్దిలో శివ కవులకున్నంత ఆవేశ కావేషాలు వీరిలో మచ్చుకైనా కానరావనే భావన నాలో బలపడింది. అన్నమయ్య కొన్ని కీర్తనల్లో శైవం కంటే వైష్ణవమే ఉత్తమం అని ప్రతిపాదించినా ఆయనలో.. "ఎంతమాత్రమున" వంటి కొన్ని కీర్తనల్లో అద్వైత వాసనలున్నాయని సాహిత్య-చరిత్రకారుల అభిప్రాయం కాబట్టి అలాంటి వివాదాంశాలను తలకెత్తుకోకుండా, కేవలం భక్తి-సంగీత విషయాలను మాత్రమే చర్చించడం జరిగింది.

ఈ రూపకం పేరు "భక్తి సంగీత వరివస్య" అని పెట్టడం జరిగింది. 'వరివస్య' అంటే సేవ లేక ఉపాసనము అని అర్థము. ఈ రూపకంలో చర్చించబడ్డ విషయాలూను చదువరుల సౌలభ్యం కోసం అంకాలు లేక దృశ్యాల వారీగా తెలియజేస్తాను.

**దృశ్యం-1:** రూపకం చంద్రగిరిలో సాళ్వ నరసింహరాయలు ఆస్థానంలో మొదలవుతుంది. మహారాజు అన్నమయ్యను ఖైదు చేసిన అనంతరం సంకెళ్ళు తెగిపడ్డం చూసి పశ్చాత్తాపం తో సభలోనికి పిలిచి గౌరవిస్తాడు. ఆ సభలో శ్రీపాద రాయలు, వ్యాస రాయతీర్థ వంటి వారు ఉంటారు. వారు అన్నమయ్య భక్తి, నవవిధ భక్తులు, నారద భక్తి సూత్రాలు, భగవద్గీత, శరీర-శరీరి భావనలు, ఆత్మ-పరమాత్మల స్వరూపాలు, మధురభక్తి, జయదేవుని కీర్తనలపై అన్నముని ప్రభావం, ఛాయాపహారులు అంటే ఎవరు? శ్రీపాద-అన్నముని రచనల్లో స్వామ్యాలు, శ్రీపాద సృష్టించిన సంకీర్తన ప్రక్రియలు ఉగాభోగము-వృత్తమాలికలు మొదలైన వాటిని గురించి సంభాషించినట్టుగా ప్రాథమికంగా పరిచయం చెయ్యడం జరిగింది.

డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

**దృశ్యం-2:** అన్నమయ్య గృహంలో మనుమడు చిన్నన్నను తొడపై కూర్చుండబెట్టుకుని సంగీత విషయాలు చెబుతూ ఉంటాడు. పెద తిరుమలయ్య వచ్చి వ్యాసతీర్థుల వారు అన్నమయ్యతో

ముచ్చటించాలని అన్నట్లు చెబుతాడు. వ్యాసతీర్థులు వచ్చి, అన్నమయ్య వైష్ణవక్షేత్ర సందర్శన పరామర్శ అయ్యాక, చంద్రగిరిలో నెలకొన్న పరిస్థితులు, వైఖానసులకూ..మహరాజుకు పడకపోవడం, వ్యాసతీర్థను తిరుమలలో అధికారిగా నియమించడం చెబుతాడు. అన్నమయ్య వ్యాస తీర్థులు ప్రతిష్టించిన హనుమంతుడి విగ్రహాల ప్రస్తావన చేస్తాడు. వ్యాస తీర్థ తను వ్రాసిన న్యాయామృత, తాత్పర్య చంద్రిక గ్రంధాలను చూసి అభిప్రాయం చెప్పమని అడుగుతూ... ఆ గ్రంధాల ప్రాధమిక విషయాలు చెబుతాడు. అన్నమయ్యను కొన్ని అద్వైత వాసనలు కొన్ని మీ కీర్తనల్లో కనిపిస్తున్నాయన్న విషయానికి అన్నమయ్య వివరణ ఇవ్వడం, వ్యాసరాయల కీర్తన వినిపించడం, అన్నమయ్య లీలాశుకుని "కస్తూరీ తిలకం లలాటఫలకే" శ్లోకం జ్ఞప్తికి వచ్చిందని అనడం. అన్నమయ్య రచనలైన సంకీర్తనా లక్షణమనే సంస్కృత గ్రంథం, మంజరీ ద్విపదలో "శృంగార మంజరి" అనే కావ్యం, 12 శతకాలు, ప్రబంధాలుగా వ్రాసిన వేంకటాచల మహాత్మ్యము, ద్విపద రామాయణం వంటి గ్రంథాల గురించి చెబుతాడు. దాససాహిత్యంలో బ్రాహ్మణేతరుల ప్రస్తావనకు స్పందిస్తూ అన్నమయ్య తన కీర్తనల్లో – "ఏ కులజుడేమి" వంటివి చెప్పి తప్పులేదనడం వంటి సంభాషణలతో దృశ్యం ముగుస్తుంది.

**దృశ్యం-3:** ఈ దృశ్యంలో వృద్ధుడైన అన్నమయ్య – నడివయస్సులో ఉన్న పురందర దాసు. తిరుమల దర్శనానికి వచ్చి, కలుసుకోవడం ప్రధాన ఘట్టం. పురందర దాసు తను వ్యాపార కుటుంబమని, బ్రాహ్మణేతరుడనని చెప్పుకోవడం..దానికి అన్నమయ్య 'బ్రహ్మ జ్ఞానవాంస్తు బ్రాహ్మణః' అని చెప్పడం, సూఫీ కవిత్వం మీద అన్నమయ్య అభిప్రాయం చెప్పడం. పురందర దాసు అన్నమయ్య తో కలిసి కీర్తన గొంతు కలపాలని ఉన్నదని చెప్పడంతో "నారాయణతే" ఇద్దరూ కలిసి పాడడం,

అన్నమయ్య దాసును "ఇందు నిన్న మొరెయ హొక్కె వెంకటేశనె" అన్న కీర్తన గానం చెయ్యమని చెప్పడం, కీర్తనల సౌందర్యం ఉక్తి వైచిత్రివల్ల సాధించబడుతుందని అన్నమయ్య వివరించి చెప్పడం, తిరుమల ఆలయ ప్రాచీనత్వం గురించి శఠగోపయతుల వారు చెప్పిన విషయాలు దాసు కోరికపై వివరించడం, "మత్స్య కూర్మ వరాహ మనుష్య సింహ వామనా యిచ్చ రామ రామ రామ హిత బుద్ధ కలికి" అన్న శ్లోకాల్లో కృష్ణుని దశావతారాల్లో ఒకటిగా పేర్కొనకపోవడం గురించి వివరణ, అన్నమయ్య "శరణాగతి" పూర్తి స్వరూపం ఉదాహరణలతో చెప్పడం, చివరలో "శరణు శరణు సురేంద్ర సన్నుత" కీర్తన ఇద్దరూ కలిసి కీర్తించడం, పురందర దాసు సెలవు తీసుకుంటూ మీ చిన్నన్న చెప్పిన మాట గుర్తు చేసుకుంటూ నేను నా ప్రయాణం కొనసాగిస్తాను ఆచార్యా.."శృతులై శాస్త్రములై, పురాణకథలై సుజ్ఞాన సారంబులై/ యతి లోకాగమ వీధులై వివిధ మంత్రార్ధంబులై నీతులై/ కృతులై వేంకటశైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై/నుతులై తాళ్ళపాక అన్నమయ్య వచోన్నత క్రియలై చెన్నగున్" అని చెప్పి వెళ్ళడంతో ఈ దృశ్యం ముగుస్తుంది.

ఈ విధంగా భక్తి సంగీత విషయాలు ప్రధానంగా ఈ రూపకం సాగింది. భక్తికి సంబంధించిన వివిధ శ్లోకాలు చెప్పినప్పుడు పాఠకుల సౌలభ్యం కోసం వాటి వివరణ ఇవ్వబడినది. ప్రకటనలో పదకవితా పితామహుడు అన్నమయ్య, వ్యాసరాయ తీర్థ, పురందరదాసు ల మధ్య జరిగిన సంభాషణలే అడిగినప్పటికి, దాస సాహిత్యానికి ఆద్యుడైన వ్యాసతీర్థ గురువు "శ్రీపాద రాయలు" చేసిన దాస సాహిత్య సేవ సామాన్యమైనదేమీ కాదు. నమః శ్రీపాదరాజాయ/ నమస్తే వ్యాసయోగినే/ నమః శ్రీపురందరార్యాయ విజయార్యాయ తే నమః" అనడం కన్నడ హరిదాసులు హరికథాకాలక్షేప సమయములో, దేవరనామములను పాడే వేళలో "శ్రీపాదరాయలకు, వ్యాసరాయలకు, పురందరదాసులకు, విజయదాసులకు నమస్కృతులు" అని స్తుతించడము వాడుక. అంటే ఈ హరినామ సంకీర్తనములకు మూలపురుషుడైన శ్రీపాదరాయలను మొట్టమొదట పేర్కొనడము ఒక గొప్ప విశేషము. అందుకే అతడిని విస్మరించడం తగదు కనుక వారూ ఈ రూపకంలో

ప్రధాన పాత్ర అయ్యారు. అన్నమయ్య కేంద్రీకృతంగా జరుగుతున్న రూపకం కాబట్టి..వారి కుమారుడు పెద్దయ్య, మనుమడు చిన్నన్న మనకు అక్కడక్కడా తారసపడతారు.

"ఇదే పరిపూర్ణమైనది.. ఇంతకంటే వారు సంభాషించినవి వేరే విషయాలు ఏమీ ఉండి ఉండవు" అని నేను చెప్పడంలేదు. వారి మధ్య ఎన్నో వేదాంత, తర్క మీమాసాది విషయాలు దొర్లి ఉండవచ్చు. సంకీర్తనల రచనా ఛందో విషయాల గురించి వారు లోతుగా చర్చించి ఉండవచ్చు. అంతలోతుగా అధ్యయనం చెయ్యకుండా "సూక్ష్మంలో మోక్షం" లాగా నా అవగాహన మేరకు, అధ్యయనం చేసిన మేరకు ఇవ్వగలిగానని.. ప్రధానంగా ఈ రూపకం సంతృప్తి కలిగించినదని మాత్రం కచ్చితంగా చెప్పగలను. మనసుపెట్టి చదివే పాఠకులకు కూడా నచ్చుతుందని విశ్వసిస్తూ...

- **డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య**

# భక్తి సంగీత వరివస్య

## దృశ్యం-1

(చంద్రగిరి సాళ్వ నరసింహరాయల రాజాస్థాన సభ. మహారాజు సభలో విచారగ్రస్తులై ఉన్నారు. శ్రీపాద రాయలు, వ్యాసరాయ తీర్థుల వారు, మంత్రి సామంత పురోహిత దండనాయక సమేతులై ఉన్నది కొలువుకూటమి)

సాళ్వ నరసింహరాయలు: అందరికి వందనాలు. శుభాభినందనలు. ఆసీనులు కండి. ఈరోజు ఒక ముఖ్యమైన కార్యం మీద ఈ కొలువు ఏర్పాటు చేశాను.

(అప్పటివరకూ గుస గుసలుగా ఉన్న సభ నిశ్శబ్దమయింది)

శ్రీపాద రాయా.. నావలన ఒక గొప్ప అపకారం జరిగింది. పశ్చాత్తాపంతో మనసు దహించి వేస్తున్నది.

(సభ యావత్తూ ఏమిటన్నట్టు ఆశ్చర్యంగా చూశారు.)

శ్రీపాద రాయలు: మీ వలన అపకారమా? ఆశ్చర్యంగా ఉన్నదే! వివరంగా సెలవివ్వండి మహారాజా!

సాళ్వ: మహా భక్తుడైన తాళ్ళపాక అన్నమాచార్యుల వారిని నా మీద శృంగార కీర్తన రచించనందున కోపించి ఖైదు చేశాను. వారు భక్తి సంకీర్తన ఆలపించగానే సంకెళ్ళు తెగి క్రింద పడడం ఈ కళ్ళతో తిలకించాను. నేను వారి పాదాలమీద పడి క్షమించమని ప్రార్థించాను. వారిని యిపుడు సర్వసత్కారాలతో సభకు ఆహ్వానించాను. మొదట నిరాకరించినా నా అభ్యర్ధన మేరకు ఒప్పుకున్నారు. (చప్పట్లు చరిచి) ఎవరక్కడ! ఆచార్యులవారిని సాదరపూర్వక వచనాలతో, ప్రస్తుతిస్తూ స్వాగతించండి.

వందిమాగధులు: ద్రావిడాగమ సార్వభౌమా! ప్రధమాంధ్ర వాగ్గేయకారా! శ్రీహరి నందకాంశ సంభూతా! స్వాగతము. సుస్వాగతం.

అన్నమయ్య: (ప్రవేశించును) సాళ్వ నరసింహరాయలవారికి, సరస్వతీ స్వరూపమైన సభకు నా నమస్సుమాంజలులు.

సాళ్వ: ఆచార్యా! నేను చేసిన మహా అపకారానికి సభాముఖంగా క్షమాపణలు చెప్పుకుంటున్నాను. ఆసీనులు కండు.

అన్నమయ్య: మహారాజా.. అందరిని శిక్షించేవాడు, క్షమించేవాడు, కాపాడేవాడు ఆ శ్రీవేంకటేశ్వరుడే! నేను, మీరు నిమిత్త మాత్రులమే! బాధపడకండి. ఇందులో నా తప్పిదం కూడా ఉన్నది. కర్మ సిద్ధాంతం ప్రకారం నాకు యిలా జరుగవలసి ఉన్నది. ఆ విషయం మరచిపొండి. ఇంకో విషయం. శ్రీనివాసుడు సదా భక్తుల పట్ల జాగరూకుడై ఉండి సంరక్షిస్తాడన్న సత్యం ఋజువయింది. అన్నీ మన మంచికే అనుకోండి. హరి భక్తులను అవమానించకండి. నా ప్రార్ధన మీకు అదొక్కటే! అహోబిల మఠ స్థాపకులైన ఆదివన్ శఠగోపయతి అనుజ్ఞానుసారం వైష్ణవ క్షేత్రాలను సందర్శించవలసియున్నది. నాకు సెలవిప్పించండి.

సాళ్వ: మీరు మీ యాత్ర నిర్విఘ్నంగా జరుపుకోడానికి మా పల్లకీ పరివారాలు మీ వెంట వస్తాయి. మీకు యాత్రా కాలంలో ఏ లోటూ కలగకుండా చూసే పూచీ... మాది.

అన్నమయ్య: క్షమించండి మహారాజా! నేను ఈ వైష్ణవ క్షేత్రాలను దర్శించేది నా ఆత్మ నివేదనానికి మాత్రమే! మీ మందీ..మార్బలము..పల్లకీలు..పరివారాలు.. ఆహార పదార్ధాలు...ఏమీ...అవసరం లేదు. ఆయా క్షేత్రాలలో కీర్తనలు నివేదించుకొనవలసి యున్నది. నన్ను ప్రశాంతంగా, విశ్రాంతిగా వెళ్ళిరానివ్వండి.

సాళ్వ: మీరు మాకోరిక మన్నించి ఈ రోజు మా సభలో గడపండి. మీ హరి సంకీర్తనా గానం మరొక్క మారు వినిపించండి.

అన్నమయ్య: అవశ్యం మహారాజా.. ఆజ్ఞ.. హరి సంకీర్తనకు సమయం ఏమున్నది. సర్వకాల సర్వావస్థలయందూ చేసుకోవచ్చు.

శ్రీపాద రాయలు: ప్రభూ! నేను, వ్యాసరాయ తీర్థులు అన్నమయ్య వద్ద భక్తి

గురించి, నవవిధ భక్తులలో ఒకటైన సంకీర్తనా ప్రాముఖ్యం గురించి చర్చించి, అభిప్రాయాలను ఒకరికొకరం తెలుసుకోవాలని ఆరాట పడుతున్నాము. తమరికి అంగీకారమైతే వ్యాసరాయ తీర్థ, ఆచార్యునితో సంభాషించాలని కుతూహలపడు తున్నాడు. పల్లవి చరణాలతో వారు సృష్టించిన తెలుగు సంకీర్తనలవలె కన్నడ దేశంలో కూడా సంకీర్తనా గానం మొదలెట్టాలని నేనూ కొంత భక్తి సంగీత పరిశ్రమ కన్నడం లో చేశాను. ఆ విషయాలు వారితో పంచుకోవాలని ఉంది.

సాళ్వ: కానివ్వండి. తొలుత సంకీర్తనలకే తలమానికమై, ఈ దక్షిణాపథంలో చిరకాలం నిలిచిపోయే, సంకీర్తనా ప్రాముఖ్యం తెలియజేసే ఒక సంకీర్తన వినాలని మా మనసు వువ్విళ్ళూరుచున్నది.

శ్రీపాదరాయలు: అన్నమా! మొదట మహారాజులవారి కోరిక చెల్లించండి. అజరామరమై నిలిచిపోయే ఒక సంకీర్తన ఆలపించండి.

అన్నమయ్య: చిత్తం...ఆ పోతనామాత్యులు సెలవిచ్చినట్లు "పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట". ఆలపించాలన్నా...ఆపాలన్నా అన్నీ ఆ అచ్యుతుడే!..... నా ప్రయత్నం నేను చేస్తాను.

(తంబూర శృతి చేసుకుని ఆలాపిస్తున్నాడు...అన్నమయ్య)

**పల్లవి:** చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడగించు సంకీర్తనమ్

**చరణం.1** సంతోష కరమైన సంకీర్తనమ్
సంతాప మణగించు సంకీర్తనమ్
జంతువుల రక్షించు సంకీర్తనమ్
సంతతము దలచుడీ సంకీర్తనమ్ చాలదా

**చరణం.2** సామజము గాంచినది సంకీర్తనమ్
సామమున కెక్కుడీ సంకీర్తనమ్

సామీప్య మిందరికి సంకీర్తనమ్
సామాన్యమా విష్ణు సంకీర్తనమ్  చాలదా
**చరణం.3** జముబారి విడిపించు సంకీర్తనమ్
సమ బుద్ధి వొడమించు సంకీర్తనమ్
జమళి సౌఖ్యములిచ్చు సంకీర్తనమ్
శమదమాదుల జేయు సంకీర్తనమ్  చాలదా
**చరణం.4** జలజాసనుని నోరి సంకీర్తనమ్
చలిగొండ సుతదలచు సంకీర్తనమ్
చలువ గడు నాలుకకు సంకీర్తనమ్
చలపట్టి తలచుడీ సంకీర్తనమ్  చాలదా
**చరణం.5** సరవి సంపదలిచ్చు సంకీర్తనమ్
సరిలేని దిదియపో సంకీర్తనమ్
సరుస వేంకట విభుని సంకీర్తనమ్
సరుగనను దలచుడీ సంకీర్తనమ్  చాలదా

(సభ కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది– సాళ్వ భూపతి ఆసనం దిగివచ్చి అన్నముని పాదాలు పట్టుకున్నాడు)

సాళ్వ: అన్నమయ్యా! సంకీర్తనా ప్రాశస్త్యం, అర్థమూ, అంతరార్థమూ... ఆవశ్యకమూ తెలియని మూరు?డినైన నేను... నామీద సంకీర్తన మాలాపించమని అడిగి ఎంత తప్పు చేశానో ఇప్పుడర్థమయింది.

అన్నమయ్య: మహారాజా! ఏమిటిది? ఇది ఎవరి తప్పూ కాదు భగవంతుడి లీల అనుకోండి... అంతే.. నేను నరుని కీర్తించనని ఎంత బ్రతిమాలినా మీరు ఆవేశంలో ఆలకించలేదు. బాధపడకండి.

శ్రీపాద: అన్నమయ్యా! ఈ సంకీర్తన భవిష్యత్ తరానికి తారక మంత్రమై నిలుస్తుంది. సంకీర్తనలకే తలమానికమై కలియుగంలో భక్తులను తరింపజేస్తుంది. భావి

గాయకులకు..సంగీత విద్వాంసులకు ఈ రాగమాలిక దివ్యమహత్తులను ప్రసాదిస్తుంది. రసిక జన హృదయాలను రంజింపజేస్తుంది.

అన్నమయ్య: ఓం నమో నారాయణాయ! గోవిందార్పణమస్తు! నేను సాధారణంగా 3 చరణాలతో పూర్తిచేసే కీర్తన ఆ అధోక్షజుని దయవల్ల ఐదు చరణాలయ్యింది. సర్వం శ్రీనివాసుని లీల.

శ్రీపాద: వ్యాసరాయ తీర్థా! నీవు నీ సందేహాలను నిర్భయంగా అడుగవచ్చును.

వ్యాసతీర్థ: ఆచార్యా! భక్తి అనే పదాన్ని పలువురు పలు రకాలుగా సెలవిచ్చారు గదా! మీ అభిప్రాయం.. అనుభవం వినాలని ఉంది.

అన్నమయ్య: వ్యాసరాయా...భక్తి అనేది చాలా విశాల దృక్పథం గల మాట. భగవంతుని యొక్క గుణగణాలను ఆకళింపు చేసుకొని అనుసరించేదే భక్తి%ా% భగవంతుని గురించి తెలుసుకొని భగవద్భక్తితో అనుసరించేవాడే భక్తుడు. అలా భగవంతుని గూర్చి తెలుసుకొని భక్తితో భగవంతుని దరి చేరుటకు అనేకమైన మార్గములు ఉన్నవి, వానిలో అతి శీఘ్రముగా భగవంతుని పరిపూర్ణ కరుణా కటాక్షము పొందుటకు ఎంచుకొన్నముఖ్యమైన మార్గము భక్తి మార్గము. నేను విశిష్టాద్వైతిని. రామానుజుల మతం ప్రకారం "తత్ర భక్తిర్నామ నిరవధికానంతానవద్య కల్యాణ గుణత్వ జ్ఞాన పూర్వక: స్వస్వాత్మీయ సమస్త వస్తుభ్య: అనేక గుణాధిక: అంతారయ సహ్రేణాప్య ప్రతి బద్ధ: నిరంతర ప్రేమ ప్రవావ:" అంటారు. అంటే కల్యాణాత్మకమై, బహుధా విశిష్టమై, ఎన్ని ఆటంకముల చేతనూ కట్టు పడని నిరంతర ప్రేమ ప్రవాహమే భక్తి అని రామానుజుల వారి భాష్యం. మరి మధ్వాచార్యులవారు సెలవిచ్చిందేమిటి?

శ్రీపాద: మధ్వాచార్యులు ద్వైతం లో చెప్పిన విధం ఏమిటంటే "మహాత్మ్యజ్ఞాన పూర్వస్తు సుధృడ స్సర్వతోధిక: స్నేహభక్తి రితి ప్రోక్త: తయాముక్తిర్న చాన్యదా! అని సెలవిచ్చారు. అంటే మహాత్మా జ్ఞానపూర్వకమై అన్నిటికంటే గొప్పదై బలమైన స్నేహమే భక్తి. దాని వల్ల మాత్రమే ముక్తి కలుగుతుందని సెలవిచ్చారు.



భక్తి సంగీత పరివస్య



వ్యాసతీర్థ: నాకు బోధించిన ప్రకారం..... వేదముల ఉత్తరభాగము ఆధారముగా వెలువడినది ఉత్తర మీమాంసా దర్శనము. దీనినే వేదాంత దర్శనమనీ, బ్రహ్మసూత్రములనీ అంటారు. ఇది వేదముల చివరి భాగమైన ఉపనిషత్తుల నుండి ఉద్భవించింది. ఈ దర్శనము జీవాత్మకు, పరమాత్మకు గల సంబంధమును ప్రతిపాదిస్తుంది. వ్యాస మహర్షి రచించిన బ్రహ్మసూత్రములను వేర్వేరు భాష్యకారులు వ్యాఖ్యానించిన విధముపై ఈ వేర్వేరు శాఖాభేదములు ఏర్పడినవి. ఆ విధంగా అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము – అనే మూడు ప్రముఖమైన సిద్ధాంతములు ఏర్పడినవి. మూడు సిద్ధాంతాలూ కూడా వేదాలనూ, ఉపనిషత్తులనూ, బ్రహ్మసూత్రాలనూ ప్రమాణంగా అంగీకరిస్తాయి కదా! కానీ అసలు ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం అనే మతాలగురించి సులభంగా....ఈ సభలోని సామాన్య జనానికి కూడా..అర్థమయేట్టు... వివరించగలరా ఆచార్యా!

అన్నమయ్య: (చిన్నగా నవ్వి) తప్పక! నాకు గతంలో ఉపనయనం అయ్యాక, తాళ్ళపాకలో స్మార్తం నేర్చుకుంటున్నప్పుడు నాకు ఇదే సందేహం వచ్చింది. కానీ తీరనే లేదు. తిరుమల మొదటిసారి దర్శించినప్పుడు నాకు ఘనవిష్ణువనే యతీంద్రులు పంచ సంస్కారాలు గావించిన సమయంలో నా సందేహం నివృత్తి చేస్తూ వారన్న మాట ఏమిటో తెలుసా! వివరాలలోకి వెళ్ళకుండా, ఒక ఉదాహరణ యిచ్చారు. పుష్కరిణిలో స్నానం చేస్తున్న ఒక గర్భవతిని చూపించి ఏమన్నారంటే... "ఆమె ఒక్కరు అంటుంది అద్వైతం. కాదు ఇద్దరు అంటుంది ద్వైతం. కాదు ఒకరిలో మరొకరు అంటుంది విశిష్టాద్వైతం. కనుక మనం అన్వయించుకునే విధానాన్ని బట్టి ఉపయోగించే ఉదాహరణ బట్టి అన్నీ సమంజసమే! " అని వారు సెలవిచ్చారు.

శ్రీపాద: భక్తిని గురించి నారద భక్తి సూత్రాల్లో "సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా" అని ఆ పరాత్పరుని యందు అతిశయించిన ప్రేమ స్వరూపమే భక్తి అన్నాడు కదా!

అన్న: అంతే కాదు రాయా! "అమృత స్వరూపాచ!" అని కూడా అన్నారు. అది శాశ్వతమైన అమృత స్వరూపం కదా!

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య



# భక్తి సంగీత వరివస్య



వ్యాస: ఆర్యులారా! ఆ అమృత స్వరూపుడే "సత్యయుగంలో శ్రీహరిగా, త్రేతాయుగంలో శ్రీరామునిగా, ద్వాపరంలో శ్రీకృష్ణునిగా, కలియుగంలో శ్రీవేంకటేశ్వరునిగా వెలిశారు. కలౌ స్మరణాన్ ముక్తిః –కలియుగంలో కేవలం దైవ నామస్మరణ చేసినంతనే ముక్తి లభిస్తుంది. అందులో కలౌ వేంకటనాయకః –కలియుగంలో వేంకటేశ్వరుని నామస్మరణ చేసినట్లయితే కష్టాలనుండి విముక్తి లభించడమే గాకుండా జీవన్ముక్తి లభిస్తుంది.

అన్న: పురుషోత్తముడైన శ్రీమహావిష్ణువు శ్రీభూసమేతుడై ఉన్న నారాయణాద్రియే పావన క్షేత్రమని రామానుజులవారు నిరూపించారు. వేంకటాచలమని మరొక పేరుతో పిలవబడే ఆ తిరుమల క్షేత్ర వైభవాన్ని సూతుడు పేర్కొన్న వరాహపురాణాన్ని, శుకుడిని ప్రస్తావించి చెప్పిన ప్రద్మపురాణాన్ని, అరుంధతీ–వసిష్ఠ సంవాదాన్ని పేర్కొన్న గరుడపురాణాన్ని, వీటిని బలపరిచే బ్రహ్మాండపురాణాన్ని ప్రమాణంగా నిరూపించారు. ఎందరో దేవర్షులు మనులు తపస్సు చేసిన తిరుమల క్షేత్రం, వైష్ణవ క్షేత్రమని వారాహం, భవిష్యోత్తరం, పద్మం మొదలైన పురాణాలు వేంకటాద్రిని పరమ వైష్ణవక్షేత్రమని ఉద్ఘోషించాయి. ఋగ్వేద వర్ణన మనం ఎరుగనిది కాదు.. దానిలో "అరాయికాణే వెంకటేగిరిం గచ్ఛ: అరాయికాణేశిరించి రస్య సత్వభిః:తేభిష్ట్వా చతయామసి". కటిక పేదవారైనను, అంధులైనను, అంగహీనులైనను లక్ష్మీపతి అయిన శ్రీ శ్రీనివాస సన్నిధికి సాత్త్వికులైన భక్తులతో కలసి వెళ్ళినచో వారి పాపములు తొలగుతాయి అని చెప్పబడింది. వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు మనకు ప్రమాణాలుగా నిలిచి ఉన్నాయి.

శ్రీపాద: "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం–అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం" ఇవి శ్రీమద్భాగవతాంతర్గతముగా చెప్పబడిన భక్తిమార్గములు. వీటిలో అన్నముల వారు కీర్తనలను ప్రాముఖ్యంగా తీసుకుని శ్రీనివాసుని అర్చించడంలో ఆంతర్యం ఏమిటి?

అన్నమయ్య: "అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ? సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః??" అని భగవత్ గీత చెప్తున్నది. అంటే పరమ పాపిష్ఠివారు అయినా సరే, నన్ను అనన్య భక్తి తో పూజిస్తే, వారిని ధర్మాత్ములుగానే పరిగణించాలి,

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

ఎందుకంటే వారు సరియైన నిర్ణయం తీసుకున్నారు కాబట్టి అని పరమాత్మ సెలవిచ్చాడు. అలాగే నారద పురాణంలో "హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం ! కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథాఎఎ అని చెప్పారు అంటే ఈ కలిలో హరినామము కంటె వేరు గతిలేదు! ముమ్మాటికీ లేదు!!

వ్యాస: మీకు సాక్షాత్తు ఆ శ్రీనివాసుడే కనుపించి తనపై కీర్తనలనాలాపించమని చెప్పాడట. ఆ విషయం తెలుసుకోవాలని ఉంది ఆచార్యా!

అన్నమయ్య: అవును తీర్థా! అదొక మహత్తర ఘట్టం. నాకు శ్రీవేంకటేశ్వరుని మీద అవ్యాజ ప్రేమకు ఆ ఘటనే... దారి తీసింది. నాకు పదహారువత్సరములప్పుడు ఆ శ్రీనివాసుని దర్శించడానికి తిరుమల వెళ్ళినప్పుడు నాకు తిరువేంగళనాథుడు ప్రత్యక్షమై "నా అంకితముగా దినమునకొక్క సంకీర్తన చొప్పున రచించమని" ఆదేశించాడు. అందువలననే ఈ ఆధ్యాత్మిక, శృంగార కీర్తనలు శ్రీవేంకటేశ్వారాంకితంగా వ్రాస్తున్నాను. నేను జీవించినంత కాలం ఇది తప్పని సరి. ఈ కట్టెలో జీవుడు ఉన్నంతవరకూ నాకు సంకీర్తనా రచనే ఉచ్ఛ్వాస హరికీర్తనమే నా నిశ్వాస.

శీపాద: మీరు శరీర–శరీరి భావనను ప్రతిపాదిస్తూ ఒక సంకీర్తన గానం చేయమని మా విన్నపం.

అన్నమయ్య: "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి ఎతథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ" అంటే చిరిగిపోయిన బట్టలను వదిలి, మనం నూతన వస్త్రాలు ధరిస్తున్నట్టే, నిరుపయోగమైన శరీరాన్ని వదిలి, ఆత్మ క్రొత్త దేహంలోకి ప్రవేశిస్తుంది. అనిత్యమైన ఈ పాంచభౌతిక దేహంకోసం అనవసర యాతనలు పడుతున్నాడు మానవుడు అనిపిస్తూ ఉంటుంది. ఈ దేహం ఒక వస్త్రం. మనం దేహధారులం. మరణం అంటే పాతబడిన ఈ భౌతిక శరీరాన్ని వదిలి పెట్టెయ్యడమే! క్రొత్తదయిన తేజోమయమైన ఆత్మతో విహరించడమే! ఆపైన వేరొక అనువైన భౌతిక శరీరంతో నూతన జన్మను తీసుకోవడమే ! ఈ ఆత్మపదార్థం యొక్క తత్వం, కేవలం యోగులకు మాత్రమే తెలుసు. దేహంలో ఉన్నప్పుడు

ఆత్మపదార్థాన్ని "దేహి" అంటాం. దేహం నుండి బయటకు వచ్చేసిన "విదేహి" అంటాం. ఇదే ఆత్మను "జీవాత్మ" అంటాం. ఆ జీవాత్మలో ఎప్పుడైతే "మంచి, చెడు" అనే భావన నశిస్తుందో అలాంటి జీవాత్మను "విముక్తాత్మ" అంటాం. ప్రతి జీవాత్మ కూడా జన్మపరంపరాక్రమంలో "విముక్తాత్మ" కావలసిందే ! ఒకానొక "విముక్తాత్మ" ఇక అందరినీ విముక్తస్థితికి తీసుకువెళ్ళడానికి కంకణం కట్టుకున్నప్పుడు ఆ విముక్తాత్మలు ఇక "పరమాత్మలు" గా పరిగణిచబడతాయి. అర్జునుడిని "జీవాత్మ" అనీ, శ్రీకృష్ణుడిని "పరమాత్మ" అనీ అంటాం. "పరమాత్మ" అంటే "అత్యున్నత స్థాయికి పరిణితి చెందిన జీవాత్మ" అన్నమాట. జీవాత్మ మొట్టమొదటి జన్మలలో..ఒకానొక "అమాయకపు ఆత్మగా" ఉంటుంది. దుష్ట సాంగత్యాలు, దుష్ట ప్రభావాల వల్ల "దుష్టాత్మగా" మారుతుంది. అదే ఆత్మ సజ్జన సాంగత్యం వల్ల, పరోపకార పరాయణత్వం వంటి సేవాభావాల వల్లా "శుభాత్మ" గా మారుతుంది. ఇక విముక్తాత్మ లోకకళ్యాణం కోసం "పరమాత్మ" అవుతుంది. "పరమాత్మ" గా కాకపోతే ఆ యొక్క జీవాత్మ పూర్ణ వికాసం చెందినట్లు కాదు. పూర్ణ వికాసం వరకు మనం మళ్ళీ మళ్ళీ పుడుతూనే ఉంటాం. 'పునరపి జననం...పునరపి మరణం" ఈ విధంగా ఎంతవరకు? అంటే "పరమాత్మగా అయ్యేంత వరకు అన్నమాట. నేను ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ ఒక సంకీర్తన గానం చేస్తాను. ఓం నమో నారాయణాయ!

**పల్లవి:** దేహి నిత్యుడు దేహము లనిత్యాలు
యీహల నా మనసా యిది మరవకుమీ

**చరణం.1** గుది బాతచీర మాని కొత్తచీర గట్టినట్టు
ముదిమేను మాని దేహి మొగి గొత్తమేను మోచు
అదన జంపగలేవు ఆయుధము లీతని
గదిసి యగ్నియు నీరు గాలియు జంపగలేవు

**చరణం.2** యీతడుడు నరకువడడు డీతడు డగ్నిడు గాలడుడు
యీతడుడు నీట మునుడుగడు డీతడుడు గాలిడు బోడుడు
చేతనుడై సర్వగతుండౌ చెలియించదేమిటను

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

యీతల ననాది యీతడిరువు గదలడు

**చరణం.3** చేరి కానరానివాడు చితించరానివాడు

భారపువికారాల బాసినవా డీయాత్మ

ఆరయ శ్రీవేంకటేశునాధీన మీతడని

సారము తియుటే సత్యం జ్ఞానము

ఈ దేహాత్మేశ చర్చ కేవలం విశిష్టాద్వైతానికే కాదు శ్రీపాద రాయా! అన్ని శాఖలకు సమమైన ముక్తి స్వరూపము.

వ్యాస: క్షమించండి. మీరు ఇద్దరు భార్యల ముద్దుల భర్తయని, వారి ద్వారానే సంగీత రస సామ్రాజ్యంలో శృంగార కీర్తనలను రసవత్తరంగా..రసికజన హృద్యంగా.. అలవోకగా రాయగలుగుతున్నారని...నేను కాదు...ప్రజలు అంటున్నారు. మీరేమంటారు?

అన్న: చాలా తప్పు అభిప్రాయం తీర్థా! లౌకిక జీవితం వేరు... పారమార్ధ చింతన వేరు. నేను ముఖ్యంగా మీలా సన్యాసం స్వీకరించకపోయినా.. లౌకిక జగత్తులో ఉంటూనే... జయదేవుని రాధామాధవ తత్త్వం స్ఫూర్తితో మధురభక్తి మార్గంలో అలివేలు మంగా శ్రీనివాసుల అమలిన శృంగారాన్ని పారమార్థక తత్త్వంలో సంకీర్తనలుగా వెలయిస్తున్నాను. కొందరు జనం శృంగార శిల్పినని, విష్ణుభక్తి ప్రచారకుడనని, సంఘ సంస్కర్తనని, సమతావాదినని, స్త్రీ-పురుష సమానత్వాన్ని నా కీర్తనల ద్వారా చాటి చెప్తున్న స్త్రీవాదినని...రకరకాలుగా మాట్లాడుకోవడం మా పెద తిరుమలయ్య కూడా విన్నానని చెప్పాడు. మన మార్గం సరయినది అయితే భగవంతుడు సహకరిస్తాడు. నీకు శృంగారంగా తోస్తున్న మధుర భక్తి సిద్ధాంతాన్ని నేను ఆకళింపు చేసుకున్నంత వరకూ చెప్తాను విను...ఈ విశాల విశ్వంలో సర్వాంతర్యామియైన భగవంతుడొక్కడే పరమపురుషుడు! తక్కినదంతయూ స్త్రీ ప్రాయమే అందుకే వైష్ణవంలో "పుమాన్ విష్ణురితిఖ్యాతః స్త్రీ ప్రాయమితరం జగత్" అంటారు. జనన మరణ చక్రభ్రమణం లో తిరుగులాడే ఈ జీవాత్మ చివరికి శాశ్వతుడైన

పరమాత్మలో లయం కావాల్సిందే. లౌకిక బంధాలను పరిశీలిస్తే, భార్యాభర్తల బంధం అరమరికలు లేనిదై, అనురాగ వాత్సల్యములతో కూడినదై, మిగిలిన బంధాల కంటే ఉత్కృష్టమైనది గాను, బలమైనది గాను మనకు కన్పిస్తుంది. అదే రీతిలో శాశ్వతుడైన శ్రీ మహావిష్ణువును  నాయకుడిగా బావించి, జీవాత్మ అనబడే మనం నాయికగా మారి శృంగారభక్తి మార్గంలో వేదాంత సోపానాలను అధిరోహించటం మధుర భక్తి సిద్ధాంతం లోని ప్రధానాంశం. ఈ క్రమంలో జీవాత్మ పరమాత్మలో అనురాగ ప్రణయం సాగిస్తుంది ఇది మధురమైన భావనతో కూడినది కాబట్టి మధురభక్తి అని అంటారు. మన భారతీయ వాఙ్మయంలో మొదటగా ఈ మధుర భక్తిని మనం భాగవతంలో దర్శిస్తాం. పరమాత్ముడైన శ్రీకృష్ణుని సాన్నిధ్యం కోసం గోపికలు తమ దేహ, మాన, ప్రాణాలను సైతం అర్పిస్తారు. ఇక రాధామాధవ తత్త్వంతో అమలిన శృంగారాన్ని భక్త జయదేవుడు అందించగా, రామానుజ మతానికి చెందిన కొంతమంది ఆళ్వార్లు నాయికాభావంలో ప్రణయభక్తి మార్గంలో వేల పాశురాలతో కీర్తించి తరించారు. వీరి రచనలను ద్రవిడవేదం, నాలాయిర్ దివ్యప్రబంధం అంటారు. ఇవన్నీ నాకు అహెూబిలంలో ఆదివన్ శఠగోపయతి సాంగోపాంగంగా బోధించారు. ఈ దివ్య ప్రబంధాల సారాంశం నా సంకీర్తనలలో నాదైన శైలిలో భావితరాలకోసం తెనిగించడానికి యత్నిస్తున్నాను. తత్ఫలితంగా శృంగార కీర్తనలు సృష్టించబడ్డాయి. నా శృంగార సంకీర్తనల రాశి మధురభక్తితో కూడినదై ఓతప్రోతమైనది. నవవిధ భక్తులలో చివరిదైన ఆత్మనివేదనమే మధురభక్తిగా రూపాంతరం చెందినది. మురారి పాదార్పిత చిత్తవృత్తి గల నాలాంటి వారు....భౌతిక ప్రపంచాన్ని మరచి, సర్వకాల సర్వావస్థలలోనూ, భగవంతుని సామీప్యం ఇందులోనే ఆరోపించుకుని స్వామి సన్నిధిలో నిరంతరం తరించాలనే తపన ఇందు గాఢంగా ఉంటుంది. నేను ఆధ్యాత్మిక సంకీర్తనలలో స్వామి వారి లీలావైభవం, ఉత్సవ విశేషాలు, భక్తి తత్త్వం, సామాజిక సందేశాలు, ప్రజాచైతన్యం, సమకాలీన చరిత్ర మొదలైన అంశాలు వెల్లడి చేశాను. ఇక శృంగార

సంకీర్తనలలో వేదాంత సోపానాలను కూడా అధిరోహించానన్న సత్యం నిజమైన హరిభక్తులకు మాత్రమే అవగాహనకు వస్తుంది. నా శృంగార సంకీర్తనలను ఈ మధురభక్తి కోణంలో పరిశీలించవలసినదిగా మిమ్మల్ను కోరుతున్నాను. నేను సంసారినైన సన్యాసిని..

శ్రీపాద: మీరు వ్రాసిన కీర్తనల్లో అతిశోభితేయం రాధా, రాధామాధవ రతి చరితమిది, జానామ్యహం, హరి రసమవిహారీ వంటి కీర్తనలు జయదేవుని ప్రభావంతో వ్రాసినవని అని నా అభిప్రాయం. మీరేమంటారు?

అన్నమయ్య: ప్రభావం అనే పదం చాలా శక్తివంతమైనది. ప్రభావం వేరు రాధా మాధవులను పాత్రలు చేసి ఆ స్ఫూర్తితో వ్రాయడం వేరు. నేను జయదేవుని అష్టపదులను, చంద్రాలోకం, రతిమంజరి, కారకవాదం, తత్త్వచింతామణి మొదలైన గ్రంధాలు చదివిన మాట నిజమే! కానీ కీర్తనలు అనుసరణలు అనుకరణలు మాత్రం కాదు. మధురభక్తికి మించి శృంగారంతో కూడినవని చాలా మంది అన్నారు. ఇది వాస్తవం కాదు. జయదేవుడికి నాకు బేధం చెప్పాలంటే వారు “నిస్త్రైగుణ్యే పథి విచరతామ్కో కోవిధ: కోనిషేధ:” అంటే ఈ నిస్త్రైగుణ్య పథంలో విధి నిషేధాలు అనేవి లేకుండా రాధాదేవి విహరించినట్టుగా గీత గోవిందంలోని భూమిక మనకు తెలుపుతున్నది. అంటే విగళిత వసనం, పరిహృత రసనం, ఉరసి మురారేరు పహిత హారే, సరసఘనే జఘనే, దోర్భ్యాంసమ్యమిత:, వామాంకే రతికేళి సంకుల సమారంభే ... ఈ విధమైన సంభోగ కీర్తనల్లో రతి పారవశ్యం అవధులు దాటింది. నాకీర్తనలను మీరు గమనిస్తే...అలుమేలుమంగ కాక ఇతర పరకీయలు, అష్టవిధ నాయికలు, చాతుర్విధ స్త్రీలు, చెంచెతలు, బోయ స్త్రీలు, గొల్లెతలు నాయికలై శ్రీనివాసునితో శృంగార స్వభావంతో మాత్రమే దర్శన మిస్తున్నారు. నేను కూడితి, యేలితి, చేరితి వంటి పదాలతో ఎక్కడా అశ్లీల ధోరణి లేకుండా నాయికా స్వభాం ఎలాంటిదయినా సరే ఆమె పరమేశ్వరాధనకు, ఆత్మార్పణకు అర్హురాలనే దృష్టితోనే నాయికా చిత్రణ చేయడం జరిగింది. ఇంకో విషయమేమిటంటే నేను స్వయంగా ఛాయాపహారుల గురించి ఒక కీర్తన ఒకటి వ్రాశాను.



## భక్తి సంగీత పరివస్య



నా సంకీర్తనలకు ఇప్పటికే అనేక అనుకరణలు, నకళ్లు వచ్చిన సంగతి నాకు తెలిసింది. వాటిని తయారు చేసి వండి వార్చిన కుకవులు నాతో తలపడ్డం కూడా జరిగింది. అందుకని ఒక కీర్తనలో "వెఱ్ఱులాల మీకు వేడుక గలితేను..అఱ్ఱువంచి తడు కల్లంగరాదా" అనే పల్లవిని బెట్టి "ఉమిసిన తమ్మలో నొకకొంత కప్రము/ సమకూర్చి చవిగొని చప్పరించనేల/ అమరగ ఛాయాపహారము సేసుక/ తమమాట గూర్చితే దైవము నగడా" అని ఛాయాపహారులను అవహేళన చేయడం జరిగింది. దానికి అర్థం మీకు తెలుసుకదా! ఉమ్మేసిన తాంబూలంలో కొంచెం కర్పూరం (ఉమిసిన తమ్మలో నొక కొంత కప్రము) కలిపి రుచి చూసి చప్పరించడం ఎందుకు? (సమకూర్చి చవిగొని చప్పరించనేల) పరుల ఛాయను లేదా శైలిని దొంగిలించి (అమరంగ ఛాయాపహారము సేసుక) అందులో తమ మాటలను కూర్చితే దైవం నవ్వడా?" అంటూ అపహాస్యం చేశాను. అలాంటి నేను అనుకరణలు చేశానంటే మీరు నమ్ముతారా! రాయా!

శ్రీపాద: అన్నమా! నేను మిమ్మల్ని అనుమానించడమా? వేల కీర్తనలు వ్రాసిన మీరు పొరబాటున కూడా అలాచెయ్యరని నాకు తెలుసు. నేను ప్రభావం ఉన్నదా? అని అడిగాను. అంతే! సరే ఇంకో విషయం ఏమిటంటే.. నేను కూడా కన్నడంలో సంకీర్తనా రచన ఆరంభించాను. రామాయణ గాథ గురించి కొన్ని చరణాలు ఆలకించండి.

"రావణాసుర కుంభకర్ణాది నరకాదిగళు
శైవకృపవను మాడి వరయ పడెయె!
అవరగళను విష్ణు నరరూపి నెందరిదు
దేవర్కళను కాయిద కథెయ నీనరయ" అన్నాను ఆచార్యా! అర్థం మీకు విదితమే కదా! రావణ కుంభకర్ణాది రాక్షసులు శివుడినుంచి అనేక వరాలను పొందినప్పటికి, విష్ణువు వారిని సామాన్యులుగానే భావించి వారిని సంహరించి దేవతలను కాపాడాడు అన్నాను.

డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య







అన్న: బాగున్నది. నేను కూడా అదే అర్థంలో ఒక కీర్తనలో వ్రాశాను.

"శిరసు తుంచి తుంచి చిచ్చులోని వేలిచి

వరములు వడసె రావణుడెన్నైనా

నిరతి రామునిచేత నిముషములోననె

వరములన్నియు నెందో వరతి పాలాయె!" – చాలా వరకు మీ కీర్తనలోని అర్థమే వస్తున్నది కదా!

శ్రీపాద: కాకాసుర వృత్తాంతాన్ని నేను "హక్కియ మేలుళ్ళ దయ నమ్మ మ్యాలె/ ఇక్కదేకే హెూద్యో విధియే" అని సరదాగా కాకాసురుడి మీద చూపించిన దయ మామీద ఎందుకు చూపించలేదు అని భగవంతునిపై ఆవేశంతో కొంత కోపం వెళ్ళగ్రక్కాను.

అన్న: బహు బాగు. నేను ఏమన్నానో తెలుసా శ్రీపాదా! "కాకాసుర దోషము కడకు బరిహరించి/ చేకొంటివి శరణంటే చేరి మగుడ/ యీ కడ మా నేరములు ఇంతకంటె నెక్కుడా!/ నీకే నీ శరణము నీవు మమ్ము గాతువు" అన్నాను. మీలాగా కోపం వ్యక్తం చేయకుండా మేము కాకాసురునికంటే తీసిపొయ్యామా అని నిందా–స్తుతి చేశాను. అవును.. మీపేరు గతంలో లక్ష్మీనారాయణ తీర్థులని అంటారు నిజమేనా?

శ్రీపాద: ఈ విషయం మీదాకా వచ్చిందా? నిజమే ఆచార్యా... ఒకప్పుడు నేను విబుధేంద్రతీర్థులతో తీర్థయాత్రలు చేస్తుండగా ఉత్తరాదిమఠ స్వాములైన రఘునాథ తీర్థులను కొప్ర అనే గ్రామములో సందర్శించడమైనది. ఆనాడు వారు అచ్చట ఒక విద్వత్సభను ఏర్పాటు చేశారు. అందులో నేను ఇద్దరు యతివర్యుల సమక్షములో టీకాచార్యులనబడే జయతీర్థుల న్యాయసుధను గురించి చేసిన వ్యాఖ్యానము బహు ప్రశంసనీయమని, ముగ్ధులైన రఘునాథ తీర్థులు "మేమంతా శ్రీపాదులమైతే (యతులైతే) నీవు శ్రీపాదరాయలు" అని అన్నారు. అదే క్రమంగా స్థిరపడింది.

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య



## భక్తి సంగీత వరివస్య



అన్నమయ్య: మిమ్మలను దాససాహిత్య పితామహుడు అని పిలవొచ్చు ఎందుకంటే అనేక కారణాలున్నాయి. అంతకు ముందు కన్నడములో విరివిగా లేని కొత్త విధములైన సాహిత్యాన్ని అందరికీ అందుబాటులో ఉండేటందుకు మీరు మార్గదర్శి. మీ మార్గదర్శకత్వము ఎలాటిదంటే...ప్రస్తుతం.. బహుజనాదరణ పొందిన దేవర నామములకు మీరే సూత్రధారి. మీరు ప్రారంభంలో వ్రాసిన భ్రమరగీతాలు, వేణుగీతాలే.. ప్రస్తుత కాలములోని పదాలకు, జావళులకు నాందీవాక్యాలను పలికాయని నా ఉద్దేశ్యం. రాగబద్ధమైన, తాళబద్ధమైన పాటలను వృత్తమాలిక ద్వారా కనిపెట్టినది కూడా మీరే! మీరు సంస్కృతములో, తెలుగులో దేవునిపై దండకాలు ఎన్నో ఉన్నా, కన్నడములో మీరు మొదటగా వ్రాసిన దండకము నిజముగా అపూర్వమైనది. అన్నిటికంటే ముఖ్యముగా రాగమాలికలవలె తాళమాలికలను మీరు వ్రాసిన సుళాదుల ద్వారా కర్ణాటకసంగీతములో ప్రవేశపెట్టిన ఘనత కూడా మీదే! మీరు గమనించే ఉంటారు. నేను కూడా కొన్ని సూళాదులు వ్రాసి శాసనాలుగా చెక్కించి తిరుమలలో పెట్టించాను. మీరు ఒక సంగీత బాణీని సృష్టించడము మాత్రమే కాక ఆ పద్ధతి నిరంతరముగా గంగాప్రవాహములా కొనసాగడానికి ప్రత్యక్షముగా, పరోక్షముగా శిష్యులను ప్రోత్సహించారు.

శ్రీపాద: ఆచార్యా! పితామహుడు అని పిలవాలంటే.. కేవలం ఏవో కొన్ని ప్రక్రియలను కనిపెట్టినంత మాత్రాన సరిపోదు. చాలా కృషి చెయ్యవలసి ఉన్నది. ముఖ్యంగా ఈ కర్ణాటక సంగీతానికి ప్రాధమికంగా ప్రజల్లోకి తీసుకెళ్ళవలసి ఉన్నది. తెలుగులో, కన్నడంలో ద్విపద, ఉదాహరణలు వంటి ఎన్నో ప్రయోగాలు చేసిన పాల్కురికి సోమనాధుడు దేనికి పితామహుడయ్యాడు? ముఖ్యంగా నాయకత్వం, బాధ్యతల వంటివి వహించి, విషయాన్ని ఒక ఉద్యమంగా ప్రజల్లోకి తీసుకెళ్ళవలసి యున్నది. లేదు అన్నమా.. కర్ణాటక సంగీత, దాస సాహిత్య విషయమై మార్గదర్శకత్వం వహించాలని మా వ్యాసతీర్థులవారిని కోరుతున్నాను.

వ్యాస: ధన్యోస్మి గురుదేవా! మీ ఆజ్ఞను విజయవంతం చెయ్యడానికి నా శాయుశక్తులా కృషి చేస్తాను. విఠలుని కరుణ! అంతే...

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

శ్రీపాద: ఆయుష్మాన్ భవ. కన్నడములో దాస సాహిత్యంలో చేసింది చాలా తక్కువ. చేయవలసినది చాలా ఎక్కువ. అందుకే ఆ కార్యం తీర్థులవారికి అప్పజెబుతున్నాను. అన్నమయ్యా! ఒక్క మాట! గురువు శిష్యుడిని పొగడ కూడదు అనే మాటకు నేను వ్యతిరేకిని. నా ప్రత్యక్ష శిష్యులలో ప్రముఖుడు ఈ వ్యాసరాయలు. ఇతడు నా వద్దకు రాక మునుపే ఎన్నో విద్యలను నేర్చినాడు. అయినా కూడ నన్ను గురువుగా అంగీకరించాడు. గురువు శిష్యుని గొప్పవాడని, తనతో సమానమని చెప్పడము సాధారణంగా అరుదు. దానికి అనేక కారణాలు అడ్డొస్తాయి. మనమూ మానవ మాత్రులమే కదా! కానీ.. నాకు వాస్తవాలను కప్పిపుచ్చడం ఇష్టం ఉండదు. వ్యాసరాయలను గురించి ఒక సారి సభలో "సాసిర జిహ్వెగళుళ్ళ శేషనె కొండాడబేకు/ వ్యాసముని రాయర సన్యాసదిరవ" అన్నాను. అర్థం మీకూ తెలుసు కదా! "వేయి నాల్కలతోడి శేషుడె మెచ్చుకొనవలెను/ వ్యాసముని రాయని సన్యాస మహిమ" అని. అంతడి ఘనుడు నా శిష్యుడు. నా మదిలో ఉన్నవి అన్నీ చేసి తీరుతాడు.

వ్యాస: తప్పక గురుదేవా! మన ఈ దక్షిణాదిత్య కర్ణాటక సంగీతాన్ని సామాన్య ప్రజలు నేర్చుకునే విధంగా చెయ్యవలసిన అగత్యం ఉంది. దానికి పాఠ్య ప్రణాలిక వంటిది ఏదో చెయ్యవలసి ఉన్నదని నా అభిప్రాయం.

శ్రీపాద: సత్యం వ్యాస రాయా!

అన్న: మీ గురు శిష్యుల సంబంధం అద్భుతం. శ్రీపాద రాయా! మీ ఉగాభోగముల గురించి మాకు తెలుసుకోవాలని ఉన్నది.

శ్రీపాద: వచన శైలిలో తాళము లేక రాగయుక్తముగా పాడడానికి అనుకూలముగా వ్రాయబడినవే నా ఉగాభోగములు. సామాన్యముగా త-న-న, త-ద-రి-న లాటి అర్థముకాని ఊత పదాలతో సంగీతంలో రాగాలాపన చేస్తారు. కానీ నా ఈ ఉగాభోగములలో రాగాలాపన అర్థవంతములైన పదాలతో ఉంటుంది. తరువాతి

వాగ్గేయకారులకు ఇవి కరదీపికలవాలని నా ప్రయత్నం. ఉదాహరణకు ఒకటి చెప్తాను. వినండి.

“కరుణది తనుమనధనంగళెల్లవు/ నిన్న చరణకమలకొప్పిసిద బళిక/ మరళి ఎన్న మరుళుమాడువరె/ సరకు ఒప్పిసిద మ్యాలె సుంకవుంటె దేవా/ కరుణాకర నిన్న చరణదడియొళిట్టు కాయో రంగవిఠల” దీనికి తెలుగులో “దయకై తనుమనధనమ్ము లన్నిటి/ నీదు పదకమలములం దుంచితిని/ మఱిక నన్ను మాయ జేసెదవె/ సరకు నొసగితిని పిదప సుంక మేల నయ్యా/ కరుణాకర నీదు యడుగులందు జేర్చికావుమ రంగవిఠల” చెప్పుకోవచ్చు.

అన్నమయ్య: శ్రీపాద రాయా! ఈ ఉగాభోగము వింటుంటే నాకు ఆదివన్ శఠగోపయతి చెప్పినట్టు విష్ణుపురాణములోని “ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైః/ త్రేతాయాం ద్వాపరో?ర్చయన్/ యదాప్నోతి తదాప్నోతిః/ కలౌ సంకీర్త్య కేశవం” శ్లోకాన్ని పోలి యున్నది కదా!

శ్రీపాద: సత్యం ఆచార్యా! అంతే! మనం పురాణాలను, ఉపనిషత్తులను జన సామాన్యంలోనికి కీర్తనల ద్వారా తీసుకుని వెళ్ళాల్సిన అగత్యం ఉంది.

అన్నమయ్య: మీ వృత్తమాలిక గురించి కూడా సెలవివ్వండి.

శ్రీపాద: నేను ప్రవేశ పెట్టిన మరొక కొత్త పంథా వృత్తమాలిక. ఈ నా వృత్తమాలికలోని విశేషమేమంటే మొట్టమొదట వృత్తములా ఒక పద్యము ఉంటుంది, దీనిని రాగయుక్తముగా పాడవచ్చును కాని దీనికి తాళము ఉండదు. దీని తరువాత ఒక పదము ఉంటుంది, ఈ పదమునకు రాగము, తాళము రెండు ఉంటాయి. పాల్కురికి సోమనాధుని ఉదాహరణ కావ్యాలలో కూడ మొదట చంపకమాలలాటి ఒక వృత్తము ఉంటుంది, తరువాత తాళబద్ధమైన కళిక, అందులోని సగమైన ఉత్కళిక, రగడ రూపములో ఉంటాయి. పాల్కురికి సోమనాధుని నమశ్శివాయ రగడ వినే ఉంటారు. దానికి దగ్గరగా ఉంటుంది. అయితే నేను దీన్ని సంస్కృత మూలం నుండి గ్రహించాను. ఉదా. ‘సా విరహే తవ దీనా’ పాడుటకు ముందు ‘యమునాతీర’ అనే శ్లోకాన్ని

పాడాలి, తరువాతనే 'నిందతి చందన' అష్టపదిని పాడాలి. నేను వ్రాసిన వృత్త, పదములను మీకు పరిచయము చేస్తున్నాను. దీన్ని రేగుప్తి రాగములో, ఝంపతాళములో ఉండే విధంగా స్వరపరిచాను. ఇలాటివి తొమ్మిది చేరి వృత్తమాలికగా అవుతుంది. మొదట ఈ వృత్తాన్ని ఆలకించండి. "వారిజాంబక, వారిజారివదన, వారాశిజావల్లభ/ వారివాహనిభాంగ, వాసవనుత, వాకెమ్మదొం దాలిసో/ వారిజోద్భవనయ్య, నిన్న విరహవారాశియొళు ముళుగిహ/ నారీనిచయవ పారుగాణిసు కృపానావెయలిందెమ్మను/ వారిజాంబక, వారిజారివదన, వారాశిజావల్లభ/ వారివాహనిభాంగ, వాసవనుత, పలు కొక్క టాలించరా/ వారిజోద్భవజనక%ా%.. "నీదు విరహవారాశిలో మునిగిన నారీతతి నిదె దాట జేయర కృపానౌకలో మమ్మిప్పుడు". ఇక ఒక పదం చెప్పాలి. మారనెంబవను బలు క్రూర నమ్మగలి నీ/ ఊరిగ్హోదుదను కేళి/ వారిజాస్త్రవను ఎదెగేరిసెమ్మను బిడదె/ హోరువను అహోరాత్రియలి తపిసుత దీన్ని తెలుగులో ఇలా చెప్పుకోవచ్చు "మారు డెందమున దయ లేదు, మము వీడి నీ/ వూరు వీడుటను వినెను/ వారిజాస్త్రమును ఎద నెక్కుపెట్టెను విడక/ పోరాడు నహోరాత్రములు తపించి" అని చెప్పుకోవచ్చు. తర్వాత ఒక శ్లోకం ఉంటుంది. అది వినండి. "పతి సుత పితృ ముఖ్య భ్రాతృ బాంధవరు ఎంబ/ అతిశయ నమగిల్ల ఆలిసో మాతనెల్ల/ రతిపతిపిత నీనే రాత్రియొళు కొళలనూదె/ క్షితిపతి నిన్నెడెగె క్షిప్రదిం బందెవల్లో" దీన్ని తెలుగులో అనువాదం చేసినట్లైతే "పతి తలిదండ్రులన్న బిడ్డ బంధువులు వీరి/ యతిశయ మది లేదు వినవయ్య మాట నిపుడు/ రతిపతిపిత నీ వే రాత్రిలో మురళి నూద/ క్షితిపతి నీ దరికి వేగమే వచ్చితిమిగా" అని అర్థం. ఇక చివరిగా ఒక పదంతో ముగుస్తుంది. "బాలతనదలి యమునాతీరదలి నీ వత్స/ పాలనెయ మాడుతిరలు ఆ/ కాల మొదలాగి ఈ వ్యాళె పరియంతరవు/ కాలుఘళిగగలదిహ కాంతెయర త్యజిసువరె" అని. దీనికి తెలుగులో "బాల్యమున నా యమునా తీరమున నీ వాలపించి.../ పాలించు చుంటివిగదె యా/ వేళ మొదలుకొని యీ వేళ వఱ కెప్పు డొక/ కాలు గడియ విడువని కాంతలను వదలెదవె" అని అర్థం

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

చెప్పుకోవచ్చు.

అన్న: అద్భుతం శ్రీపాదరాయా! మీ కృషి ఈ సృష్టిలో ఈ దక్షిణాదిత్య సంగీతం ఉన్నన్నాళ్ళూ ఉంటుంది.

సాళ్వ: వ్యాసరాయా..అన్నమాచార్యా.. మీరివురు కర్ణాటక సంగీతానికి మూల స్థంభాలై నిలుస్తారు. ఈ రోజు నా పూర్వ పుణ్యఫలమువలన అనేక విషయాలు తెలుసుకున్నాను. ఆచార్యులవారి క్షేత్ర సందర్శనం అయ్యాక మళ్ళీ ఒకరోజు పిలుద్దాం. సభ ఇంతటితో చాలిద్దాం.

అన్నమయ్య: ఓం నమో నారాయణాయ...(నమస్కారం చేస్తాడు)

శ్రీపాద : విఠలా...పాండురంగ విఠలా..మహారాజులకు జయోస్తు!!!...విజయోస్తు!!!

వ్యాస: అస్తు... సెలవు...

-000-

# భక్తి సంగీత వరివస్య

## దృశ్యం-2

(అన్నమయ్య గృహం. అన్నమయ్య మనుమడు చినతిరుమలాచార్యులను బయట అరుగుమీద, తొడపైకూర్చోబెట్టుకుని తంబూర మీటుతూ గానం చేస్తూ...చెబుతున్నాడు)

అన్నమయ్య: చిన్నన్నా!....ఇలా ప్రతి చరణం చివరలో పల్లవి మొత్తం..మళ్ళీ పాడాలన్న మాట.

చినతిరుమలాచార్య: అలాగే తాతగారూ...

(ఇంతలో పెదతిరుమలాచార్యులు బయట నుంచీ వచ్చి తండ్రి పాదాలకు నమస్కరించాడు)

పెద తిరుమల : నాన్నగారూ! చిన్నయ్య మీ మాట వింటున్నాడా!

అన్న: (చిన్నగా నవ్వుతూ) నువ్వు మాత్రం చిన్నప్పుడు నా మాట విన్నావా.... నీకంటే వీడే కొంచెం నయం... ఇంకా చిన్నతనం కదా... వింటాడు....వింటాడు... నీకూ నాకూ సరిజోడుగా కీర్తనలు వ్రాయించే వరకూ నేను వీడిని వదలిపెట్టను గదా...వెళ్ళు చిన్నా...వెళ్ళి ఆడుకో...

పెద తిరుమల: నాన్నగారూ...ఒక ముఖ్య విషయం! నేను ఇవాళ మాడవీధిలో ఉన్నప్పుడు, వ్యాసతీర్థులవారు శిష్యులతో వెళ్తూ..నన్ను చూసి పిలిచారు.. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలని... భోజనం అయ్యాక వస్తానని చెప్పమన్నారు.

అన్న: వారెందుకు శ్రమతీసుకుని రావడం....తీర్థులు ఇప్పుడు తిరుమలలో అధికారి. నేనే ఉత్తరాదిమఠానికి వెళ్ళేవాడిని గదా!... సరే.. సరే.. నువ్వెళ్ళి భోజనం చెయ్యి..వారు వస్తే నేను మాట్లాడుతాను.

(కొద్ది నిముషాలకు వ్యాస తీర్థులు ఇద్దరు శిష్యులతో వచ్చారు)

అన్న: ఈరోజు మా గృహం పావన మయింది. లోనికి దయచేయండి. ఎన్నాళ్ళయింది

మిమ్ము చూసి. చంద్రగిరిలో మహారాజాస్థానంలో మీ గురువు శ్రీపాదరాయలతో చూశాను. నువ్వూ పెద్దవాడివయ్యావు తీర్థా!

వ్యాస: ఆచార్యా!... మీ వైష్ణవ క్షేత్ర సందర్శనం సంతృప్తికరంగా సాగిందా?

అన్న: వ్యాసా! నీ జ్ఞాపక శక్తి అమోఘం. చాలా బాగా జరిగింది వెళ్ళినచోటల్లా సంకీర్తనలు రాయగలిగానన్న తృప్తి లభించింది. కొన్ని కీర్తనలను రాగిరేకుల మీద చెక్కించి సింహాచలం, మంగళగిరి, అహోబిలం వంటి ఆలయాల్లో పెట్టించాను. అయితే (నవ్వుతూ) భవిష్యత్తరాలు రాగం విలువ తెలియక రాగికోసం వాటిని కరిగించుకోకుండా ఉండాలని శ్రీనివాసుని ప్రార్థించాను కూడా.... ఇంకా నారసింహకొండ, పెనుశిలకోన చాలా తిరిగాను. వావిలపాడు, బొమ్మిరెడ్డి చెర్ల అలా మార్గ మధ్యంలో వచ్చినవన్నీ చూశాను. ప్రస్తుతం నా కీర్తనలను, పెద్దవాడి కీర్తనలు రాగిరేకుల మీద లిఖించి పెడుతున్నాను.

అవునూ...వ్యాసా! వైఖానసులను ఆలయ సేవలనుంచీ తప్పించారట. గోల గోల పెడుతున్నారు. రామానుజుల ఆజ్ఞ మహారాజు పాటించడంలేదు. ఇక్కడ తిరుమల ఆలయం బాధ్యతలు మీకు అప్పజెప్పామని విన్నాను. చాలా సంతోషం. ఆ శ్రీమన్నారాయణుని సేవ చేసుకునే భాగ్యం మీకు కలిగింది.

వ్యాస: ఏదో చిన్న సమస్య. ఏమైందో ఏమో తెలీదు. వైఖానసులకు మహారాజులవారికి పూర్తిగా పడడంలేదు. నరసింహరాయలు చెప్పిన ఆగమ విధానాలు, పద్ధతులు వాళ్ళకు ఇష్టంలేదు. వాళ్ళంటే మహారాజు మండి పడుతున్నారు. నియమాలకు విరుద్ధమైనా కొద్దిరోజులు వైఖానసుల ప్రాబల్యం తగ్గించాలని.. తాత్కాలికంగా ఉండమని నన్ను కోరారు. కొద్దిగా వారికి.. మహారాజుకు సర్ది చెప్పి.. మళ్ళీ వాళ్ళనే వుంచాలి. నేను పూజలూ కైంకర్యాలు. విశిష్టాద్వైత పద్ధతుల్లోనే జరిపిస్తున్నాను. రామానుజులఆజ్ఞ వైఖానసులే ఉండాలనికదా...నాకు తెలుసు...చూద్దాం.. కొద్ది కాలం.

అన్న: రాజాజ్ఞ ధిక్కరించలేము కదా.. అందునా సాళ్వ నరసింహరాయలు. (నవ్వి)

ముక్కుమీద కోపం కదా!

వ్యాస: (నవ్వి) నిజమే! చేయగలిగింది లేదు కదా... (పెద్దగా నిట్టూర్చి) అసలు విషయం చెప్పాలి మీకు. ఆచార్యా! నేను కొన్ని గ్రంధాలు వ్రాశాను. శిష్యులచేత నకళ్ళు వ్రాయించి అందజేస్తాను. అవి మీరొకమారు చూసి మీ అభిప్రాయం సెలవివ్వండి. మార్పులు చేర్పులు ఉంటే చెప్పండి.

అన్న: తప్పకుండా..వ్యాసా! ఏమి గ్రంధాలు అవి?

వ్యాస: న్యాయామృత, తాత్పర్య చంద్రిక అనేవి. మందార మంజర అనే గ్రంధం, న్యాయ మీమాంస మీద ఇంకొకటి ఈ మధ్యనే మొదలెట్టాను. ఈలోపు శ్రీవారి కొలువులో చేరాను. తర్వాత నాకు భేదోజ్జీవన అనే గ్రంధం...మధ్వ మతాచారం దృష్టిలో ఉంచుకుని అన్ని గ్రంధాలలోని ముఖ్య సూత్రాలు.. ఏవిధంగా విబేధిస్తున్నాయో కూడా వ్రాయాలని మదిలో ఉన్నది. భావి తరాలకు మనం మిగిల్చే ఆస్తులు ఇవే కదా! విఠలుని కరుణ ఉంటే గాని ఇవన్నీ పూర్తి అవవు అన్నమార్యా!

అన్న: న్యాయామృత, తాత్పర్యచంద్రికల గురించి నాకు కొంత తెలియ జేయండి. అంటే అవి వ్రాసిన మీ ఉద్దేశ్యం వగైరాలు...నాపని కొంచెం సులువవుతుంది. మీరనుకున్నది దానిలో ప్రతిబింబించిందా లేదా అన్నది చూడాలి కదా!

వ్యాస: నేను గత కాలం వారికంటే గొప్పగా వ్రాశానని చెప్పను కానీ.. నా ప్రణాలిక, రచనోద్దేశాలు వేరు. మొదట న్యాయామృతం గురించి చెప్తాను. ఈ గ్రంధం నాలుగు అధ్యాయాలుగా విభజించాను. మొదటి అధ్యాయంలో అద్వైతం, బ్రాహ్మణం మొదలైన విషయాల ప్రాధమిక చర్చ. వాటి నిర్వచనాలు. ముఖ్యంగా ఈ గ్రంధంలో గతంలో ప్రతిపాదించినవి ఎంతవరకూ తర్కానికి నిలుస్తాయన్నది నా చర్చల ద్వారా సూటిగా నిరూపించడానికి ప్రయత్నించాను. అలాగే తరువాయి అధ్యాయాలలో ద్వైత అద్వైత ప్రమాణాలు, మోక్షము గురించి నాకున్న అభిప్రాయాలను కుండ బద్దలు కొట్టినట్టు చెప్పాను. దీన్ని ఆవిష్కరించాక ద్వైత-అద్వైతుల మధ్య ఎన్ని వివాదాలు...చర్చలూ.. వస్తాయో చూడవలసి ఉంది.

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య


భక్తి సంగీత వరివస్య


అన్న: తాత్పర్యచంద్రిక గురించి....

వ్యాస: (నవ్వి) ఆచార్యా! మీరు విశిష్టాద్వైతులైనా మీకు పూర్వాశ్రమ అద్వైత వాసనలు కొన్ని మీ కీర్తనల్లో కనిపిస్తున్నవి. మీరు నా గ్రంధాన్ని ఏ మత ప్రభావం లేకుండా చూడగలరని కోరుతున్నాను.

అన్న: నేను వైష్ణవాగమ సిద్ధాంతాలు ఎన్నడూ అతిక్రమించి కీర్తించలేదు వ్యాసా! ఒక కీర్తనలో "నమక చమక సహిత నారసింహా!" అని ఉంది. నిజమే! కొన్ని నారసింహ క్షేత్రాలలో జరిగే తంతు గురించి వ్రాశాను. ఇంకా నాకు తెలిసి "ఎంతమాత్రమున ఎవ్వరు తలచిన" అనే కీర్తనలో "కొలుతురు మిము వైష్ణవులు కూరిమితొ విష్ణుడని, పలుకుదురు మిము వేదాన్తులు పర బ్రహ్మంబనుచు, తలతురు మిము శైవులు తగిన భక్తులునూ శివుడనుచు, అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవుడనుచు" అని వ్రాసాననేనా మీరనేది?

వ్యాస: (నవ్వి) ఆచార్యా! మీరు సూక్ష్మగ్రాహి.

అన్న: ఒక్క విషయం గమనించండి. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే ... శివస్య హృదయం విష్ణుర్ విష్ణోశ్చ హృదయం శివః యథా శివమయో విష్ణురేవం విష్ణుమయః శివః యథాతరం న పశ్యామి తథా మే స్వస్తిరాయుషి" అంటారు కదా! సుమారు రెండు వందల యేళ్ళ క్రితం.. తిక్కన సోమయాజి సింహపురి మండలంలో హరిహరనాధ తత్త్వాన్ని ప్రతిపాదించి, గౌరవింప జేసి, మత విద్వేషాలకు తావు లేకుండా చేశారు కదా! నేనూ అదే ఉద్దేశ్యంతో శ్రీహరిని కొంత మంది విష్ణువని, కొంతమంది శివుడని పిలుస్తారు. బేధంలేదు. సర్వము హరిహర స్వరూపము, అద్వైత సిద్ధి సాధకము అనే తత్త్వానికి మూలం 'శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే" అనే అద్వైత భావనతో వ్రాశాను అంతే! శివకేశవుల అభిదత్వ ప్రతిపాదన గురించి ఒక్కవిషయం చెప్పాలి మీకు. మీరు దక్షిణా పథంలో హనుమంతుడి విగ్రహాలు, దేవాలయాలు అనేకం ఏర్పాటు చేశారు గదా! హరిహర అద్వైతభావానికి ఒకేఒక్క

ముఖ్య ప్రతీక హనుమంతుడు. పరస్పరం ద్వేషించుకొనే శైవ వైష్ణవ మతాలు రెంటికి ఏకైక అంగీకార్యుడైన దైవం హనుమంతుడు. శ్రీమహావిష్ణువుయొక్క అవతారమైన శ్రీరాముని పరమభక్తాగ్రేసరుడయిన ఆంజనేయుడు దాసభక్తికి ప్రతీక అయిన పరమవైష్ణవ శిఖామణి. ఊర్ధ్వపుండ్రాలు ధరించి శ్రీరాముని ముందే కాక వేంకటేశ్వరస్వామి, చెన్నకేశవస్వామి మొదలగు సకల విష్ణుస్వరూపాల ముందు ప్రతిష్టితుడవటం చూస్తాం. అటువంటి పరమ వైష్ణవ శిఖామణి నిజానికి ఈశ్వరాంశ సంభూతుడు.

వ్యాస: వాస్తవం ఆచార్యా! (నవ్వి) నా గ్రంధం తాత్పర్యచంద్రిక గురించి చెప్తాను. ఇది జయతీర్థులు వారు వ్రాసిన గ్రంధానికి వ్యాఖ్య. మధ్వ బ్రహ్మసూత్ర భాష్యం అనుకోవచ్చు. ఇది వార్తికం అని చెప్పడానికి సాహసించను కానీ నా శక్తి మేరకు మంచి వ్యాఖ్యానం వ్రాశాననే నేను భావిస్తున్నాను. ఇది శంకర, మధ్వ, రామానుజులు బ్రహ్మ సూత్రాలపై చేసిన కృషిని దీన్ని మధ్వతత్త్వ కోణంలో పరిశీలించి వ్యాఖ్యానించాను. మొదటి రెండు అధికరణాలలో బ్రహ్మసూత్రాల గురించి కూలంకషంగా అంటే ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత కోణాల్లో తర్కించాను. తర్వాత అధికరణల్లో జయతీర్థులు వారు వ్రాసిన గ్రంధానికి వ్యాఖ్య. మీరు ఒకసారి నాకోణంలో పరిశీలించమని మనవి. మీకు ఈ ప్రస్థాన త్రయం మీద మంచి పట్టు ఉందని నాకు మీ గురువర్యులు ఆదివన్ శఠగోపయతి అహోబిలంలో ఒక సారి మాటల మధ్యలో చెప్పారు.

అన్న: మీరు ఈ గ్రంధ రచనల్లో పడి సంగీతాన్ని విస్మరించకండి తీర్థా! ఈ మధ్య మీ "కృష్ణ నీ బేగనే బారో" కీర్తన కన్నడదేశంలో మారుమ్రోగుతున్నదని విన్నాను. ఆ కీర్తన మీ నోటితో వినాలని ఉన్నది.

వ్యాస : తప్పక..ఆచార్యా!







ప. కృష్ణ నీ బేగనే బారో... బేగనే బరో..ముఖవన్ను తోరో కృష్ణ నీ బేగనే బారో

చ.1. కాలలందిగి గెజ్జే నీలద బావులి.. నీలవర్ణనె నాట్య వాడుత బారో.....కృష్ణ నీ...

చ.2. ఉడియల్లి ఉడిగెజ్జె బెరళల్లి ఉంగుర ఎ కొరళొళు హాకిద్ద వైజయంతి మాలె ... కృష్ణ నీ ...

చ.3. కాశీ పీతాంబర కైయల్లి కొళలు... పూసిద శ్రీగంధ మైయొళు ఘుమ–ఘుమ ... కృష్ణ నీ .....

చ.4. తాయిగె బాయల్లి జగవన్ను తోరిద జగదోద్ధార నమ్మ ఉడుపియ శ్రీ కృష్ణ... కృష్ణ నీ...

అన్నమయ్య: ఉడిపి కృష్ణుణ్ణి కళ్ళముందు సాక్షాత్కరింప జేశావు తీర్థా! లీలా శుకుని "కస్తూరీ తిలకం లలాటఫలకే" శ్లోకం గుర్తొచ్చింది. మీరు చదివారు కదా! లీలాశుకుడు రచించిన శ్రీకృష్ణ కర్ణామృతం. ఈ గ్రంధంలోని శ్లోకాలన్నీ "ముక్తక"రూపంలో ఉన్నాయి. అంటే అన్ని శ్లోకాలూ స్వతంత్రంగా సమగ్రమైన అర్ధాన్ని అందిస్తాయన్నమాట. ఈ శ్లోకాలు అటు ఉత్తర భారతదేశంలోనూ, ఇటు మన దక్షిణ భారతదేశంలోనూ సంగీత సభలలో, భజన కార్యక్రమాల్లో విరివిగా ఆలపిస్తూంటారు. సభలలో రాగమాలికలుగా విద్వాంసులు గానం చేసే శ్లోకాలు మాత్రమే కాకుండా తాళలయాన్వితాలై మృదంగాది వాద్యాలతో సహా పాడతగినవీ, నృత్యాభినయం చేయదగినవీ, నిబద్ధ గేయాలు అనదగిన వృత్తచ్ఛందస్సులు కృష్ణకర్ణామృతంలో సగానికి మించి ఉన్నాయి. లీలా శుకుడు కారణ జన్ముడు. మీలాగే లలాటమున కస్తూరీ తిలకము దిద్దుకొన్న వాడు, వక్షః స్థలమున కౌస్తుభ మణిని ధరించిన వాడును, ముక్కు నకు బులాకీగా మంచి ముత్యమును ధరించిన వాడును, చేతులలో వేణువు గలవాడును, చేతులకు కంకణములు ధరించిన వాడును, దేహమందతటను హరిచందనము పూయబడిన వాడును, కన్ఠము నందుముత్యాల హారమును ధరించిన వాడును, గోపికా స్త్రీలతో పరివేష్టింపబడి యున్నవాడును, అగు

గోపాల చూడామణి అయిన శ్రీ కృష్ణుడు విజయమునుపొందు గాక !! అని ఎంత అందంగా కీర్తించాడు.

వ్యాస: మీ ప్రస్తుత కృషి.... కీర్తనలు కాకుండా... ఇంకా ఏమి వ్రాస్తున్నారు.

అన్నమయ్య: సంకీర్తనా లక్షణమనే సంస్కృత గ్రంథం ఒకటి. మంజరీ ద్విపదలో "శృంగార మంజరి" అనే కావ్యం. అడపదడపా తీరిక ఉన్నప్పుడు శతకాలు. 12 శతకాలు అయ్యాయి. ప్రబంధాలుగా.. వేంకటాచల మహాత్మ్యము, ద్విపద రామాయణం వంటి గ్రంథాలు రచించాను. ప్రస్తుతం కీర్తనలు మాత్రమే. పెద్దయ్య కూడా ఆధ్యాత్మిక, శృంగార కీర్తనలు వ్రాస్తున్నాడు.

వ్యాస: మీ తాళ్ళపాక వంశీయుల సారస్వతము ఒక క్షీర సముద్రం. కావ్యముల ధర్మమైన శైలిలో, భావవైవిద్యంలో, రాశిలో మీ రచనలను మించిన రచనలు ఆంధ్ర వ్మాయంలో మరొక్కటి లేవని భావి తరాలు కీర్తించగలవు. నగుబాట్లైన ద్విపద, పద కవితలను కూడా ఉద్ధరించి ఉన్నత స్థానం కలిగించిన ప్రతిష్ఠ ముమ్మాటికీ మీదే అన్నమాచార్యా!

అన్న: (నవ్వుతూ) సర్వం నారాయణార్పణ మస్తు! నాదేముంది తీర్థా.. రాయించే వాడు ఉండగా నాకు దిగులేమిటి చెప్పు... అవునూ...శ్రీపాదుల వారి ఆజ్ఞానుసారం ఈ భక్తి సంగీతాన్ని సామాన్య ప్రజలు కూడా నేర్చుకుని తరించవలసి యున్నది. ఆ దిశగా మీ ప్రయత్నాలు సాగుతున్నాయా!

వ్యాస: ఇన్ని పనులలో అవి కష్ట సాధ్యమని తెలిసి మంచి శిష్యులను తయారు చేస్తున్నాను. వారు దాస సాహిత్యాన్ని సృష్టించి అజరామరం చేస్తారని నా ప్రగాఢ విశ్వాసం ఆచార్యా! ఇంకో మాట ఈ కార్యక్రమంలో బ్రాహ్మణేతరులను కూడా భాగస్వామ్యం కాబోతున్నారు. దీనిపై మీ అభిప్రాయం.

అన్న: మంచిదే తీర్థా! నా కీర్తన "ఏ కులజుడేమి" వినలేదా? "బ్రహ్మమొక్కటే!" కీర్తన ఇవన్నీ కులతత్వాన్ని నిలదీసేవే! భక్తి ప్రధానమని నా విశ్వాసం. కులాన్ని బట్టి బ్రాహ్మణత్వం రాదు. బ్రాహ్మణత్వాన్ని నిర్ణయించేది కులమా? గుణమా? అని ఎవరైనా

నన్నడిగితే గుణమే అని నిస్సందేహంగా చెబుతాను. ఒక వ్యక్తి పుట్టుకతో బ్రాహ్మణుడై ఉండవచ్చు. కాని అతనిలో అహంకారం, దర్పం, విచ్చలవిడి జీవితం, విలాసాల మీద కోరికలు, అబద్ధపు నడవడిక ఉంటే అతడు బ్రాహ్మణుడుగా పరిగణించబడడు. ఇంకొకడు ఇతర కులాలలో పుట్టినప్పటికీ, అతనిలో ఈ లక్షణాలు లేకపోతే అతన్ని బ్రాహ్మణుడుగానే పరిగణించవచ్చు. ఇక బ్రాహ్మణకులంలో పుట్టి, పై దుర్గుణాలు లేనివాని మాట చెప్పేదేమున్నది? అతను అత్యుత్తముడు! "జన్మనా జాయతే శూద్ర: సంస్కారాద్ ద్విజ ఉచ్యతే, వేదపాఠీ భవేద్విప్ర:బ్రహ్మ జానాతి బ్రాహ్మణ:" అని స్మృతులు చెబుతున్నాయి. దీని అర్థం ఏమిటంటే, పుట్టుకతో అందరూ శూద్రులే! అనగా అజ్ఞానంతోనే అందరూ జన్మిస్తారు. సత్కర్మల ద్వారా, తపస్సాధనల సంస్కారాల ద్వారా వారు ద్విజులవుతారు. వేద గ్రంథ పఠనం వలన జ్ఞానాన్ని పొంది విప్రులవుతారు. మీ కృషి కొనసాగించండి. విజయోస్తు.

వ్యాస: శెలవు.. ఆచార్యా!

**-000-**

# భక్తి సంగీత వరివస్య

## దృశ్యం–3

(అన్నమయ్య, ఇరవై సంవత్సరముల మనుమడు చిన్నన్న శ్రీహరి దర్శనం అయ్యాక హుండీ దగ్గరలో ఉన్న ఒక అరలో రాగిరేకులను సర్దుతూ ఉండగా అక్కడికి పురందరదాసుల వారు వస్తారు)

అన్నమయ్య: మీ నాయన వ్రాసిన కీర్తనలను ఇక్కడ పెట్టించాను. నీవు ఎప్పుడు వ్రాస్తావు చిన్నన్నా...

చిన్నన్న: నేను మీ చరిత్ర ద్విపదగా వ్రాశానుగదా తాతగారూ.. నేను కొన్ని కీర్తనలు వ్రాయడం మొదలుపెట్టాను... కానీ మీకు చూపలేదు. అవునూ...తాతగారూ...అటు చూడండి. ఎవరో హరిదాసు మీ వైపు వస్తున్నాడు.

పురందరదాసు: ద్రావిడాగమ సార్వభౌములు, అన్నమాచార్యుల వారికి... శ్రీవ్యాసతీర్థ శిష్య పరమాణువు...పురందరుని నమస్కారాలు.

అన్నమయ్య: నారదాంశ సంభూతులైన పురందరదాసుల వారికి అన్నమయ్య ఆశీస్సులు! మీరు కర్ణాటక సంగీత పితామహులని బిరుదు వహించారు. చాలా సంతోషం. మీ గురువు ద్వారా మీ సంగీత ప్రజ్ఞను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉన్నాను. చాలా సంతోషం.

పురందరదాసు: మీరు సాక్షాత్తూ శ్రీవారి నందకాంశ సంభూతులు గదా! సాక్షాత్ శ్రీవేంకటేశ్వరుని అవతారమే మీరు. మీ కీర్తనలు ఇలా సాళ్వనరసింహరాయల వారు అరనొకటి ఏర్పాటు చేసి భద్రపరచడం..సముచితమైన నిర్ణయం. భావి తరాలకు లభించనున్న సారస్వత నిధిగా భావిస్తూ...మీ కీర్తనల భాండాగారానికి సాష్టాంగ ప్రణామాలర్పిస్తున్నాను.

అన్నమయ్య: మీరు సంధ్యకోసం సాక్షాత్ విఠలుని చేతనే జలం తెప్పించుకున్న మహానుభావులు. ఆయుష్మాన్ భవ!

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

పురందరదాసు: తిరుమలకు వెళ్ళినప్పుడు మీతో తప్పక ముచ్చటించమని మా గురువుల ఆజ్ఞ. మీకు ప్రస్తుతం కుదిరితే నాకు కాస్త సమయం ఇస్తారా! ఇక్కడ మధ్వ మఠాధిపతులతో కలిసి సాయంత్రం కన్నడ దేశమునకు వెళ్ళవలసి యున్నది.

అన్నమయ్య: చిన్నన్నా... నువ్వు ఇంటికి వెళ్ళు. భాండాగారం బీగాలు మీ నాయనకు ఇవ్వు. నేను కొంత సమయం పురందరుల వారితో గడిపి వస్తాను.

పురందరదాసు: రండి ఆచార్యా..రండి ఆ... మండపంలో విశ్రాంతిగా మాట్లాడుకుందాం.

అన్న: నన్ను ముసలితనం బాగా హరిస్తోంది. హరి ఇంకా నన్ను ఎంతకాలం ఉంచుతాడో తెలియదు. మీరు ఈ సారి వచ్చేసరికి ఉంటానన్న నమ్మకం లేదు నాకు.

పుర: అలా అనకండి ఆచార్యా...ఇలా సుఖాశీనులుకండి.

అన్న: హమ్మయ్యా...పురందరా! శ్రీపాద రాయల వారు ఆరోగ్యంగా ఉన్నారా? వారిని దర్శించి చాలా కాలమైంది.

పురందర: బయటకు తిరగడంలేదు కానీ...మఠంలోనే..సంధ్యా..అవన్నీ మామూలుగానే చేస్తున్నారు. (నవ్వుతూ) నాకు విచిత్రం అనిపించేదేమిటంటే..వారు వేదాంత చర్చల్లో పాల్గొంటున్నప్పుడు మాత్రం నాకు వారిలో వృద్ధాప్య ఛాయలే కనిపించవు. యువకులవలెనే తర్కం చేస్తూ ఉంటారు.

అన్న: (నవ్వుతూ) దాన్నే దైవ బలం అంటారు పురందరా! నీవూ పెద్దవాడవైనప్పుడు తెలుస్తుందిలే! సరే!... కన్నడంలో నీ కీర్తనలు లక్ష పైచిలుకేనట...మీ గురువుల ఆకాంక్ష నెరవేర్చావు చాలా సంతోషం.

పురందర: అంతా పెద్దల ఆశీస్సులు ఆచార్యా! మీకు తెలిసే ఉంటుంది. నేను రత్నాల వర్తకుడిని.

అన్న: నేను అడగలేదు కదా! అందరిలోను ఆ బ్రహ్మమే ఉంటుంది. మీ గురువర్యులు కొంతకాలం క్రితం ఈ విషయం నాకు నర్మగర్భంగా చెప్పారు.

పురందర: చెప్పడం నా విధి ఆచార్యా!. మీరు నేను సద్బ్రాహ్మణుడని భావించే అవకాశం ఉంది కదా!

అన్న: ఇప్పుడు నాకు బ్రహ్మ సూత్రాలు వల్లించే ఓపిక తగ్గిపోయింది పురందరా! కానీ ఒక్క విషయం... ఎవరు బ్రాహ్మణుడు? గుణాన్ని బట్టి జాతి. ఎవరయితే సద్గుణ సంపన్నుడు అయి సత్యాన్ని పలుకు తాడో అతడే నిజమయిన బ్రాహ్మణుడు అని తెలియ చేసే జబాల, సత్యకాముల కథ అందరూ ఎరిగినదే కదా! 'బ్రహ్మ జ్ఞానవాంస్తు బ్రాహ్మణః' అని బ్రాహ్మణునికి నిర్వచనం చెప్పారు సనాతనులైన పూర్వీకులు. మహాభారతంలో 'పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును/ నిజముశూద్రుకంటె నీచతముడు సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు/ నతడు సద్విజుండ యనిరి మునులు" అని చెప్పారు.

పురందర: సూఫీ కవిత్వం మీద మీ అభిప్రాయం సెలవివ్వండి.

అన్నమయ్య: ఎవరి మతం వారిది. ఎవరిని నిందించకూడదు. అయితే ఏమతానికైనా పరమత సహనం లేకపోవడం దుర్మారం. అన్ని మతాల చరమ లక్ష్యం ఒక్కటే! పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవడం. ధ్యాన మరియూ దైవిక భావనలతో ఏర్పడ్డదే సూఫీ తత్త్వం. గజనీ మహమ్మద్ అన్ని సార్లు దండెత్తి ఏం సాధించాడు? తను మలేరియా వ్యాధితో చనిపోతూ....తన సంపదనంతా మంచం చుట్టూ పరిపించుకుని వదలి వెళ్ళిపోతున్న చివరి దశలో పాపం చేశానని రోదించాడట. కుళ్ళి కుళ్ళి ఏడిచాడట. అదే పాపభీతి ముందే ఉండినట్లైతే అతడే దేవుడయ్యే వాడు. సరే..మరి...మన భగవద్గీతలో చెప్పినట్టుగానే వాళ్ళ ఖురాన్ లో కూడా "నేను మానవుని సృజియించి అతని శ్వాసలో నా చైతన్యాన్ని నింపాను" అని ఉంది అంటారు. మనదేశంలో సుమారు 300 సం.నుండి ఈ సూఫీ తత్త్వం ఉంది. విశ్వ మాయని "నానాటి బదుకు నాటకమని" నమ్మినట్టుగానే వాళ్ళ మతస్తులు కూడా చెప్తారు. శ్రీవైష్ణవంలో శరణాగతి లాగే వాళ్ళూ అల్లా శరణాగతిని నమ్ముతారు. ఇంకా యోగిలక్షణాలు, జ్ఞానం, నిరాడంబరత విషయాల్లో మనలాగే ఆలోచిస్తారు. జహనీయన్

శాఖకు చెందిన ఈ సూఫీ యోగులు వర్తమాన ప్రపంచానికి ఇంకా అంతా స్పష్టంగా తెలీదు. వారి తత్త్వం విశిష్టమైనదే అని నా నమ్మకం. ఆ విషయంలో వాళ్ళు వాళ్ళ సిద్ధాంతాలను సాహిత్యాన్ని భారతీయ భాషల్లోకి తేవలసి ఉంది. అప్పుడుగానీ సూఫీ తత్త్వం మనకు పూర్తిగా అవగాహనకు రాదని అనుకుంటున్నాను.

పురందర: ఆచార్యా! నాకు వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు అంత లోతుగా తెలియవు. నాకు తెలిసింది ఆ విఠలుని కీర్తించడమే! మీతో కలిసి ఆ శ్రీవేంకటేశ్వరుని కీర్తించాలని ఉంది.

అన్న: ఇద్దరమూ ఒకే కీర్తన రచిద్దామని నీ ఉద్దేశమా పురందరా..సంతోషం. నీవు కన్నడంలో వ్రాయవచ్చు. సంస్కృత పదాలతో చేద్దాం.

పురందర: భావి తరాల వారికి .... ద్వైతానికి....విశిష్టాద్వైతానికి ఏదో కొద్ది బేధం ఉన్నా హరిదాసులందరూ ఒకటే అని చెప్పాలని ఒక చిన్న ప్రయత్నం ఆచార్యా! కానివ్వండి పల్లవి అందుకోండి...

అన్న: (గొంతు సవరించుకుని) ఆలాపన చేస్తూ...(కూడా పాడమని సైగ చేస్తాడు) నారాయణతే నమో..నమో..(పురందరదాసు కూడా గొంతు కలుపుతాడు) నారాయణతే నమో నమో..నారద సన్నుత నమో నమో... ఈ కీర్తన బేహాగ్ రాగంలో చేద్దాం పురందరా! (పురందరుడు తల యూచుతాడు)

పురం: నారాయణతే నమో నమో..భవ..నారద సన్నుత నమో నమో...

అన్న: మురహర భవహర ముకుంద మాధవ/ గరుడ గమన పంకజనాభ/ పరమ పురుష భవబంధ విమోచన/ నరమృగశరీర నమో నమో...

పురం: మురహర భవహర ముకుంద మాధవ/ గరుడ గమన పంకజనాభ/ పరమ పురుష భవబంధన కేశవ/ నరహరిశరీర నమో నమో...

అన్న: జలధిశయన రవిచంద్రవిలోచన/ జలరుహాభవనుత చరణయుగ/ బలిబంధన గోపవధూవల్లభ/ నళినోద్ధర తే నమో నమో...

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

పురం: జలధిశయన రవిచంద్రవిలోచన/ జలరుహభవనుత చరణయుగ/ బలిబంధన గోవర్ధన వల్లభ నళినోద్ధర తే నమో నమో...

అన్న: ఆదిదేవ సకలాగమ పూజిత/ యాదవకుల మోహనరూప/ వేదోద్ధర శ్రీ వేంకటనాయక/ నాదప్రియ తే నమో నమో...

పురం: ఆదిదేవ సకలాగమ పూజిత/ యాదవకుల మోహనరూప/ వేదోద్ధర శ్రీ వేంకటనాయక/ పురందర విఠలతే నమో నమో...

అన్నమయ్య: భేష్! బాగున్నది పురందరా! ఇంకేమిటి విశేషాలు చెప్పు.

పురం: నాకీనాడు పరమానందంగా ఉంది ఆచార్యా! మీ సంకీర్తనా పటిమ గురించి మా గురువర్యులు చెప్తుంటే వినిపొంగి పోయేవాడిని. ఈనాడు కళ్ళారా చూస్తున్నాను. చెవులారా వింటున్నాను.

అన్నమయ్య: నీ కీర్తనల్లో వేంకట రమణుని కీర్తించే “ఇందు నిన్న మొరెయ హొక్కె” బాగా ప్రాచుర్యం పొందిందట. మీ గొంతులో ఆ పాట ఇక్కడ ఈ ఆలయంలో వినాలని ఉంది పురందరా!

పురం: అలాగే ఆచార్యా! “ఇందు నిన్న మొరెయ హొక్కె వెంకటేశనె ఎంతిగాదరెన్న కాయో శ్రీనివాసనె/ (చ.1) శేషగిరి వాసా శ్రీష దోస రహితనె ఏషు దినకు నిన్న/ పాద దాసను నానే క్లేష కేయిస తిరు ఎన్న స్వామియు నీనే/ (చ.2) కమల నయన కమల నాభ హే దయానిధే/ యమనపురది శిక్షిస తిరు పార్థసారథియే// (చ.3) ఉరగ శయన సురరి కొడెయ సిరియ రమణనె శరణ బాల/ బిరుదు తోరి పొరెయొ దేవనే కరుణిసెనగె ముక్యియ పురందర విఠలన”

అన్నమయ్య: చాలా బాగున్నది పురందరా! ఒక్క మాట...కీర్తనల్లో అది తెలుగైనా కన్నడమైనా ఉక్తి వైచిత్రి చాలా ముఖ్యం. కీర్తనల సౌందర్యం ఉక్తి వైచిత్రివల్ల సాధించబడుతుంది. ఇది లేకపోతే వస్తువుకు నవ్యత్వం ఉండదు. “ఉక్తి వైచిత్ర్యేణతు త ఏవార్థ నిరవధయో భవంతీతి/ తద్విషయాణాం ప్రతిభాన మానంత్య ముపపన్న

మతి/ నను ప్రతిభావంతస్య కిం ఫలమితి నిర్ణేతుం వాణీ నవత్వ మయాతి” అని లోచనము చెబుతున్నది.

పురందర: అవును ఆచార్యా! ప్రయత్నిస్తాను. నేను కన్నడంలో అలతి అలతి పదాలలోనే ఎక్కువ రచించాను. తిరుమల ఆలయ ప్రాచీనత్వం గురించి శఠగోపయతుల వారు ఏమి చెప్పారో నాకు వివరంగా చెప్పండి. రామానుజులకు ముందు కూడా తిరుమల బాగా ప్రాశస్త్యంలోనే ఉన్నదా ?

అన్నమయ్య: పురందరా! తిరుమలకు శతాబ్దాల చరిత్ర ఉన్నది. అహోబిలంలో విద్యాధ్యయనం చేస్తున్నప్పుడు... 3వ శతాబ్దిలో ఇళంగో కవి వ్రాసిన తమిళ కావ్యం “సిలప్పదిగారం”లో వేంకటేశ్వరుని వర్ణన ఉన్న విషయం తెలిసింది. ఈ రచనలో “తిరువరంగత్తిల్ కిడంద తిరుక్కోలముమ్, వేంగడత్తిల్ నిన్ల తిరుక్కోలముమ్” అని చెప్పబడ్డది. అంటే శ్రీరంగంలో (తిరువరంగత్తిల్) పడుకుని ఉన్న పవిత్ర రూపమూ, వేంకటంలో (వేంగడత్తిల్) నుంచుని ఉన్న పవిత్ర రూపమూ అని అర్థం. పురాణాల్ని మినహాయిస్తే వేంకటమూ, వేంకటేశు గుఱించి 2, 3 శతాబ్దులకే తమిళ కావ్యాలలో ప్రస్తావన ఉంది. అటు తరువాత 3–8 శతాబ్దులకు చెందిన ఆళ్వారుల కాలానికి వేంకటేశుడు వేంకటాద్రితో సహా వర్ణించబడ్డాడు. ఆళ్వారులు వందల పాశురాల్లో వేంకటేశుని కీర్తించారు. ఈ ఆళ్వారుల్లో తొలి తరానికి చెందిన పేయ్ఆళ్వార్ తిరుమలై అనే పదాన్ని వాడారు. తిరుమలై లేదా తిరుమల అన్నవి తమిళ పదాలు. తిరు అంటే శ్రీ లేదా పవిత్రమైన అని అర్థం. తిరుమలై అంటే శ్రీపర్వతం లేదా పవిత్రమైన పర్వతం అనీ, తిరుపతి అంటే శ్రీపతి లేదా పవిత్రమైన నాథుడు అనీ అర్థాలున్నాయి కదా! ఇదే నేను వారి ద్వారా విన్న విషయం.

పురందర: ఆచార్యా! మీరు దశావతారాల గురించి దాదాపు వందకుపైగా సంకీర్తనలు వ్రాశారు కదా! “మత్స్య కూర్మ వరాహ మనుష్య సింహ వామనా యిచ్చ రామ రామ రామ హిత బుద్ధ కలికి” అన్న శ్లోకం ప్రకారం చూసినా లేక 8వ శతాబ్దికి చెందిన “మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః/ రామో రామశ్చ రామశ్చ బుద్ధః

కల్కి రేవచ." అన్న మామల్లపురం శాసనాల్లోనూ కూడా.. దశావతారాలలో కృష్ణుడు లేకపోవడం ఆశ్చర్యం కదా! కానీ మీరు కృష్ణుడిని కూడా ఒక అవతారంగానే భావించారు కదా! ఇలా ఎందువల్ల జరిగి ఉండవచ్చు?

అన్నమయ్య: "లలిత స్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం/ జులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో/ జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై/ వెలయున్ భాగవతాఖ్య కల్పతరువు పుర్విన్ సద్విజ శ్రేయమై" అన్నాడు మహాభాగవతాన్ని కల్పవృక్షంతో పోల్చి చూపిస్తూ పోతన మహాకవి. లలిత స్కంధము అంటే మనోహరమైన విభాగాలు కలది అని భాగవతపరంగా అలాగే వృక్షపరంగా లలితమైన స్కంధములు కలది అని. విశేషణాలు వుభయాన్వయంగా, అటు మహాభారతానికి యిటు కల్పవృక్షానికి కూడా పొందుపరచడం జరిగింది. కృష్ణమూలము, ధృఢమైన మూలము వృక్షపరంగా, శ్రీకృష్ణ పరమాత్ముడే మూలము యిందులో భాగవతపరంగా! అలాంటిది కృష్ణుడనేది అవతారం కాదన్న వాదన ఎందుకొచ్చిందో! పురందరా! సనాతన ధర్మంలో కృష్ణావతారం గురించి చాలా ప్రతిపాదనలు, విశ్వాసాలు ఉన్నాయి. ప్రధానంగా ఒకటి – కృష్ణుడు విష్ణుమూర్తి దశావతారాల్లో ఒకటి, ఆయన పరిపూర్ణావతారం అంటుంది. రెండు – కృష్ణుడు స్వయంగా ఒక దేవీ శక్తి, ఆయన గోలోకం అనే లోకంలో రాధాదేవితో కలిసి ఉంటాడు, అంతేతప్ప ఆయన ఒక అవతారం కాదు అంటుంది. మొదటిది చాలామందికి హిందువులకు తెలిసినది... నమ్మేది శ్రీవైష్ణవం కూడా చెప్పింది ఇదే! కానీ కృష్ణుడు గోలోకం నుంచి వచ్చాడన్నది భారతదేశంలో ఒక మతం వారి వాదన. నీవు చెప్పిన శ్లోకాలు ఆయా కాలాల్లో ఆయా మతానికి సంబంధించిన వారు వ్రాసినవి, శాసనాల్లోవి, అయి ఉండవచ్చు. అయితే, మా గురువులు శఠగోపయతీంద్రులవారు దీన్ని సమన్వయం చేసుకోవడానికి ఒక ముఖ్యమైన కిటుకు చెప్పారు. అదేంటి అంటే.. అసలు విష్ణువు ఒకే ఒక్క స్వరూపం అని మనం అనుకుంటాం కదా. అది నిజమే.. కానీ ఆ విష్ణువునే 24 మంది విష్ణువులుగా కూడా దర్శించారట.

వీళ్ళే మన దేవతార్చనలో కేశవ నామాల్లో వస్తారు. వీళ్ళలో చివరి వాడు కృష్ణుడు..చివరిలో కృష్ణాయ నమః అని ముగిస్తాం కదా! అలా కృష్ణుడు స్వయంగా ఒక విష్ణువు, అంతే తప్ప కేవలం అవతారం కాదని సమన్వయం చేసుకున్నారు. పురందరా! ఒక్క విషయం గమనిస్తే..శ్రీకృష్ణుడు మాత్రమే తన విశ్వ విరాట్ రూపాన్ని ద్వాపరయుగంలో ప్రదర్శించాడు. ఇంకే అవతారంలోను ఇలా జరుగలేదు ఎందుకని? మళ్ళీ మనకు అదే సమాధానం..కృష్ణుడు స్వయంగా విష్ణువు కాబట్టి అవతారం కాదు.. అంతే! ఇక గోలోకంలోని కృష్ణుడు 24వ విష్ణు రూపంగా చివర ఎందుకు ఉన్నాడంటే ఈ గోలోకం మన భూమికి అతి సమీపం అన్నారు. అంటే విష్ణు తత్వం తెలుసుకోదలిచినవారికి కృష్ణ తత్వం తెలుసుకోవడం ద్వారా అయితే తేలిక అన్నారు పెద్దవాళ్ళు. ఈ లెక్క ప్రకారం కేశవ రూపంలోని విష్ణుమూర్తి తత్వం తెలుసుకోవడం అత్యంత కష్టం అంటారు. ఎంత కష్టమంటే అది సాక్షాత్తూ దేవతలకు, దేవేంద్రుడికి కూడా అసాధ్యం అని అంటారు. కానీ ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం అన్నీ శ్రీకృష్ణుడు అవతారమనే నమ్ముతారు. ఇలా, చూస్తే మనం ఈ రెండు విషయాలు కృష్ణుడు గోలోకంలో స్వయం దైవం అన్నది, కృష్ణుడు విష్ణుస్వరూపం అన్నది సమన్వయం చేసుకుని ఏ తికమక లేకుండా మన మనసులు కృష్ణయ్య మీదే నిలపగలం అనుకుంటున్నాను.

పురందర: ఆచార్యా! లెస్సగా సెలవిచ్చారు. సంతోషం. ఆచార్యా! సంకీర్తనలలో శ్రీవేంకటేశ్వరుని శరణాగతియే ముక్తికి మార్గమని మీ ప్రబోధం కదా! ఆ శరణాగతికి సంబంధించిన విషయాలు, మరియూ షడ్విధ శరణాగతికి మీరిచ్చే వివరణ ఏమిటి?

అన్నమయ్య: నాజీవితమే దీర్ఘ శరణాగతి పురందరా! శరణం యధా తథా ఆగతి: అంటారు. పాంచరాత్రమునకు సంబంధించిన సంహితలలో అహిర్బుధ్న్య సంహిత ఒకటి ఉన్నది. దానిలో "ఉపాయే గృహరక్షిత్రోశ్శబ్ద: శరణమిత్యయం/ వర్తతే, సాంప్రతం చైష ఉపాయార్థైక వచక: అనే శ్లోకం ప్రకారం భక్తుని పరమపదమునకు తీసుకుని వెళ్ళడానికి భగవంతుడొక్కడే సాధనము అని చెప్తారు.

డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

ఈ శరణాగతి షడ్విధములుగా మనం గ్రహించ వలసి ఉన్నది. అవి మొదటిది..ఆనుకూల్య సంకల్పము..అంటే "శృతి: స్మృతి: మమైవాజ్ఞా" అనే భగవద్వచన సారము శృతి, స్మృతులో చెప్పబడిన నిత్య నైమిత్తికములందు, భగవద్ విషయములను మాత్రమే శ్రద్ధ కలిగి ఉండే విధంగా సంకల్పించుకోవడం. రెండవది... ప్రాతికూల వర్జనము..అనగా భగవత్వ్యతిరిక్తములు, భగద్విరుద్ధములు అగు విశేషములను పరిత్యజించడం...మూడవది రక్షష్యతీతి విశ్వాసము అంటే భగవంతుడు నన్ను తప్పక రక్షిస్తాడు అనే గాఢ విశ్వాసం కలిగి ఉండాలి. దీనికి ఉదాహరణగా నన్ను సాళ్వ నరసింహరాయలు నాపై అకారణంగా కోపించి మూరురాయర గండ సంకెల వేయించినప్పుడు..నేను ఏమాత్రం భయపడలేదు. నాకు తెలుసు గజేంద్రుడిని రక్షించడానికి వచ్చిన శ్రీహరి, ప్రహ్లాదుణ్ణి రక్షించడానికి వచ్చిన శ్రీహరి నాకోసం కూడా తప్పక వస్తాడు..కాపాడుతాడు అనే విశ్వాసంతో ఉన్నాను. పలుమార్లు సంకెల వేసినా నేను సంకీర్తన అందుకోగానే...ఆ శ్రీహరి మహత్తువలన భళ్ళున ముక్కలు ముక్కలై తెగి పడేవి. దీన్ని ఏమంటాము చెప్పు పురందరా! రక్షష్యతీతి విశ్వాసము కాదా! నాల్గవది గోప్తృత్వ వరణం..ఇదీ పైలాంటిదే నాకు నీవు తప్ప వేరే రక్షకుడు లేడు అనుకోవాలి. ఐదవది ఆత్మ విక్షేపము..దీనికి అర్థం చెప్పాలంటే నేను ఏది తిన్నా తాగినా ఏ పని చేసినా "నారాయణార్పణమస్తు" అని చేస్తాను. సర్వం ఆయనే తిన్నా..లేచినా..తిరిగినా అన్నిటికి కారకుడు ఆయనే కదా! ఇక చివరిది కార్పణ్యం..అంటే దేవుడి ముందు నేను అకించనుడను అనుకోవాలి. నాకు నీవే దిక్కు అనుకోవాలి...మన దీనత్వమును చాటుకోవాలి. ఈవిషయమై నేను " దీనుఁడ నేను దేవుఁడవు నీవు...నీ నిజమహిమే నెరపుటఁ గాకా" అనే ఒక ఆధ్యాత్మిక సంకీర్తన వ్రాశాను. దానిలో "తలచ బాపమని తలచ బుణ్యమని/ తలపున ఇక నిను దలచేనా/ అలరిన నాలో యంతర్యామివి/ కలుష మెడయ నను గాతువు గాకా" అని నా దీనత్వాన్ని ఆ శ్రీనివాసుడి యెడ చాటుకున్నాను.

పురందర: ఆహా.. మీరు పరమ భాగవుతోత్తములు..నందవరకులాగ్రణులు,

వైష్ణవోత్తములు, మురహరి సంకీర్తనప్రియులు...మీ సంకీర్తనలు స్మరించినంత మాత్రాన భూత, ప్రేత, బేతాళ పిశాచములు సైతము పారిపోయి శుభంబులు గలిగించు వాడని మా గురువర్యుల వల్ల ఎరిగితిని. నేడు కళ్ళారా చూసే భాగ్యం కలిగింది. నా జన్మ ధన్యం.

అన్నమయ్య: మీరు మాత్రం సాక్షాత్ ఆ పాండురంగ విఠలు ని అంశలో జన్మించిన వారు కాదా! అపర నారద స్వరూపం కాదా పురందరా!

పురందర: సంకీర్తన వాఙ్మయ వైశిష్ట్యాన్ని సమగ్రంగా..సాంగోపాంగంగా అవగాహన చేసుకున్న మీరు ఆంధ్ర సాహితీ జగత్తులోనే సంకీర్తనా రచనలకు ఆద్యులు. తమ ప్రజ్ఞా పాటవాలన్నీ భక్తికి ఉన్ముఖంగా పర్యవసింపజేసిన భక్త శిఖామణులుగా మిమ్మల్ని ప్రస్తుతిస్తున్నాను. మీ సంకీర్తనలు భావి భారతావనిలో భాషాబేధం లేకుండా శాశ్వతకీర్తిని సంతరించుకుంటాయి.

అన్నమయ్య: నారాయణార్పణమస్తు!

పురందర: మీతో గొంతు కలిసి ఇంకొక్క సంకీర్తనను ఆలపించి%లా%.. మీ పద్ధతిలోనే కన్నడంలో ఒక సంకీర్తన ఆ విఠలునికి సమర్పించుకోవాలని ఉంది ఆచార్యా!

అన్నమయ్య: అలాగే పురందరా! కానివ్వు...(ఆలాపన చేస్తున్నాడు అన్నమయ్య) నీ తరహాలో ఇదే రాగతాళాలతో కీర్తించు..పల్లవి ఆలాపిస్తున్నాను...పురందరా...

పల్లవి: శరణు శరణు సురేంద్ర సన్నుత..శరణు శ్రీసతి వల్లభా..శరణు రాక్షస గర్వ సంహర..శరణు వెంకటనాయకా...శరణు శరణు...

పురం: శరణు శరణు సురేంద్ర వందిత..శరణు శ్రీపతి సేవితా..శరణు పార్వతి తనయ మారుతి శరణు...సిద్ధివినాయకా...శరణు శరణు...

అన్న: కమలధరుడును కమలమిత్రుడు...కమలశత్రుడు పుత్రుడు..క్రమముతో మీకొలువు కిప్పుడు..కాచినా రెచ్చరికయా

పురందర: నిటలనేత్రన దేవి సుతనే..నాగభూషణ ప్రియనే... తటిల్లతాంకిత..

కోమలాంగనె..కర్ణకుండల ధారనె..

అన్న: ఎన్నగల ప్రహ్లాద ముఖ్యులు..నిన్ను గొలువగ వచ్చిరీ...విన్నపము వినవయ్యా.. తిరుపతి వేంకటాచలనాయకా..

పురం: కుక్షియొళు..మహాలంబోదరనె..ఇక్షు చాప గెలిదనె...పక్షివాహన నాద పురందర విట్ఠల నిజ దాసనె...

అన్నమయ్య: వృద్ధాప్యం బాగా ఆవహించింది పురందరా...నీవలె గంభీరంగా పదం పలకలేకపోతున్నాను. సంతృప్తిగా లేదు నా కీర్తన నాకే..

పురం: ముప్పై వేల కీర్తనల పైచిలుకు రచించినా ఇంకా మీకు సంతృప్తి కలగడంలేదంటే ఆశ్చర్యంగా ఉంది ఆచార్యా!

అన్నమయ్య: మీ మరుసటి తిరుమల దర్శనం వేళకు ఈ కాయం ఉంటుందన్న నమ్మకంలేదు పురందరా.. ఆనామమే దివ్యౌషధంగా సేవిస్తున్నాను. "హరి అచ్యుతాయంటే నణగును పాపములు/ నరసింహ యన అంటె నాటిన దు:ఖములు మాను/ పురుషోత్తమా యంటె బుంద్లు పూచుట మాను/ పరమౌషధ మీతడే పాటింప మాకు."

పురం: సత్యం చెప్పారు. విఠలునకు మా విన్నపం కూడా వినండి. "ఇదుకొళ్ళి భవరోగ కౌషధవను/ యింద్రియవ జైసువుదె ఇదకె ఇచ్ఛా పథ్య...వాసుదేవన నామ వాత విధ్వంసిని/ జనార్ధనన నామ జ్వరాంకుశ/ మాధవన నామవే మనగండ మందూర/ మంగళాత్మన నామ మాల్యవసంత.." – శెలవు అన్నమాచార్యా.. మీ చిన్నన్న చెప్పిన మాట గుర్తు చేసుకుంటూ నేను నా ప్రయాణం కొనసాగిస్తాను."శృతులై శాస్త్రములై, పురాణకథలై సుజ్ఞాన సారంబులై/యతి లోకాగమ వీధులై వివిధ మంత్రార్ధంబులై నీతులై/ కృతులై వేంకటశైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై/నుతులై తాళ్ళపాక అన్నమయ్య వచోన్నత క్రియలై చెన్నగున్" నమస్కారం. విఠలుని కరుణా కటాక్ష ప్రాప్తిరస్తు.

అన్నమయ్య: శుభం పురందరా! మీ గురువర్యులను అడిగినట్టు చెప్పు. "విష్ణువాఙ్మయని చెప్పేనిధి సంకల్పమేడది/ విష్ణుమాయని చెప్పే విశ్వమంతా నెవ్వనిది/ "విష్ణుమయం సర్వ" మనే వేదవాక్య మెవ్వనిది/ విష్ణువు శ్రీవేంకటాద్రి విభుడే ఆదేవుడు"

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

ఓం..నమోనారాయణాయ.. మనోవాంఛాఫలసిద్ధిరస్తు..శ్రియ: కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినాం! శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్!!!

# భరత వాక్యం

ముగింపుగా కొన్ని మాటలు చెప్పాలనుకుంటున్నాను. ఇలాంటి సాహిత్య ప్రయోగాలు చేసేటప్పుడు వీటికి ఊహాపరిజ్ఞానం మీద, విషయ అవగాహనల మీద, సంగీతం, సాహిత్యాల మీద చాలా పట్టు అవసరమని భావిస్తున్నాను. ఆ కాలపు కర్ణాటక దేశము అంటే ఇప్పటి మహారాష్ట్ర, ఆంధ్ర దేశాలలో కొన్ని భాగాలు కూడా ఉండేవి. జైన, బౌద్ధ, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత ధర్మాల కూడలి ఈ ప్రదేశము. బసవేశ్వరుని వచనాలు, అక్కమహాదేవి వచనాలు వీరశైవ సిద్ధాంతాలను ప్రాచుర్యములోకి వచ్చిన రోజులవి. పద్యం తన యౌవనాన్ని, పదం తన బాల్యాన్ని జరుపుకుంటున్న రోజులవి.

అన్నమయ్య విశిష్టాద్వైత వాది. రామానుజ మతావలంబి. శ్రీవ్యాసరాయలవారు శ్రీపాదరాయలు, వారు మధ్వమతావలంబులు. మధ్వాచార్యులు వాదవివాదాలలో చాల మంది పండితులను ఓడించగా, గురువైన అచ్యుతప్రేక్షుడు ఇతనికి ఆనందతీర్థుడనే పేరు నిచ్చి వేదాంతసామ్రాజ్యానికి సార్వభౌముడిగా చేశాడు. ఇతడు శంకరుని అద్వైత మతములో తార్కికముగా ఎన్నో లోటులను ఎత్తి చూపి మహాభారతానికి తాత్పర్యాన్ని, భగవద్గీతకు ఒక కొత్త భాష్యాన్ని రచించాడు. చివరకు ద్వైతమతాన్ని స్థాపించాడు. దీనినే తత్త్వవాదమని కూడా అంటారు. మధ్వ మతావలంబులు మధ్వాచార్యులను హనుమంతుని, భీముని తరువాతి అవతారమని తలుస్తారు. ద్వైత సిద్ధాంతములో హరి సర్వోత్తముడు, వాయువు జీవోత్తముడు. జీవాత్మ పరమాత్మలకు, జడమునకు పరమాత్మకు, జీవాత్మకు జీవాత్మకు, జడమునకు జీవమునకు, జడమునకు జడమునకు భేదమున్నదన్నదే ఈ తత్త్వపు వాదన. 'సో?హం' కాదు 'దాసో?హం' అన్నదే భక్తికి ముక్తికి మార్గము అని ప్రబోధించారు.

వీరి మధ్య అనేక వివాదాంశాలు చోటుచేసుకున్నట్లు నాకు అనిపించింది. ఆ కాలములో రాగాలు ఏ రాగాలలో పాడబడినాయి అన్నది వివాదాంశమే. ఎందుకంటే మోహనలాటి రాగాలు అన్నమాచార్యుల రాగిరేకులలో లేవు. బహుశా

అవి వేరే పేరులతో ఆ కాలములో పిలువబడుతూ ఉండేవేమో? ఆ కాలపు రాగాలలో ముఖ్యమైనవి..ఆనందభైరవి, ఆరభి, ఆహిరి, కల్యాణి, కాంభోజి, కాపి, కురంజి, కేదారగౌళ, గుండక్రియ, గూర్జరి, తోడి, దేశి, ధన్యాసి, నాట, నాదనామక్రియ, నారాయణి, పున్నాగవరాళి, పూర్వి, బౌళి, భైరవి, మధ్యమావతి, మాయామాళవగౌళ, మాళవశ్రీ, ముఖారి, మోహన, రేగుప్తి, వరాళి, వసంత, శంకరాభరణము, శుద్ధసావేరి, శ్రీ, సారంగ, సావేరి, సురటి, సౌరాష్ట్ర, హిందోళ. ఇందులో ఎక్కువగా కల్యాణి, కాంభోజి, తోడి, నాదనామక్రియ, భైరవి, శంకరాభరణ రాగములలో ఉన్నవి. అలాగే సంగీతములో తాళము చాల ముఖ్యమైనది, అందుకే భావ, రాగ, తాళములు కీర్తనలకు అవసరము అంటారు. కాని కర్ణాటక సంగీతములో ఒక ఐదు శతాబ్దములకు ముందు తాళరీతులు శాస్త్రీయముగా వాడబడేవి కావు. ఎన్నో విధములైన విభజనలు ఉండేవి. పూర్వ కాలములో సంగీతములో తాళములను మార్గ తాళములు, దేశి తాళములు అనేవారు.

ముఖ్య విషయం ఏమిటంటే..ఇన్ని మత వైరుధ్యాల మధ్య.. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతాల చర్చల ఉన్న సమయంలో శ్రీపాదరాయలు, వ్యాసరాయ తీర్థులు అన్నమాచార్యులను కలిసినారా అనే ప్రశ్న నన్ను వేధిస్తున్నది. ఈ సాహిత్య రూపక ప్రయోగంలో అనేక సందేహాలు.. అనుమానాలు అన్నమయ్య, పురందరదాసుల సమాగమమును గురించి అన్నమయ్య మనుమడు వర్ణించాడు గాని అన్నమయ్య శ్రీపాదరాయల, అన్నమయ్య వ్యాసరాయల ముఖాముఖిని గురించి అతడు వ్రాయలేదు. శ్రీపాదరాయలు, వ్యాసరాయలు, అన్నమాచార్యులు సమకాలీనులు. వీరిలో శ్రీపాదరాయలు అందరికన్న పెద్దవాడు. వీరు ముగ్గురు ఒకే రాజు ఆస్థానములో (చంద్రగిరిలోని సాళువ నరసింహరాజు) ఉన్నారు. ముఖ్యముగా తిరుమల శిఖరాన వెలసిన శ్రీనివాసునిపై భక్తి పారవశ్యముతో పాడారు. పండ్రెండు సంవత్సరాలు దేవునికి పూజ చేసిన వ్యాసరాయలు అదే దేవుడిముందు ప్రతిరోజు పాడిన అన్నమాచార్యులతో మాట్లాడి ఉండడంటే నమ్మశక్యము కాదు. అన్నమయ్య వ్రాసి శిలాఫలకాలపై చెక్కించిన సూళాదులు తప్పక శ్రీపాదరాయల ప్రేరణ,

ప్రోత్సాహములుగా ఉండాలన్న విషయములో అతిశయోక్తి లేదు. కొందరు భిన్న మతాలను అనుసరించడము దీనికి కారణమేమో అని ఊహిస్తారు. నా ఉద్దేశములో అది కారణము కాదు. శ్రీరంగములో చాలా కాలము గడిపి అక్కడి తమిళ పాశురములను విని అదే విధముగా కన్నడములో ఉద్యమాన్ని ప్రారంభించిన శ్రీపాదరాయలకు ఇట్టి సంకుచిత స్వభావము ఉండి ఉండదని నేను భావిస్తాను. అంతే కాక శ్రీపాదరాయల అనుమతితో శ్రీనివాసుని పూజించిన వ్యాసరాయలు ఆ పూజను విశిష్టాద్వైతరీతులలో చేసినాడు కాని ద్వైతవిధానములో కాదు. కాబట్టి ఇది సబబు అని నాకు తోచదు. శ్రీపాదరాయలు, వ్యాసరాయలు రాజగురువులుగా ఉన్నారు. అన్నమయ్యకు నరసింహరాయలకు తరువాతి కాలములో అంతగా పొంతన కుదరలేదు. ఇది ఒక వేళ కారణమేమో? లేకపోతే శ్రీపాదరాయల, వ్యాసరాయల మతాలలో అన్నమయ్యను గురించిన దాఖలాలు ఉన్నాయేమో? ఔత్సాహికులు ఈ విషయాన్ని బాగుగా పరిశోధించాల్సి ఉంది.

**-000-**

## ఆధార గ్రంథాలు/ వ్యాసాలు


1. అన్నమయ్య-శ్రీపాద రాయలు అన్నమయ్య-పురందరదాసు - డా.సర్వోత్తమన్, పారిజాత ప్రచురణలు, 1982.
2. శ్రీపాదరాయలు (వ్యాసం) జెజ్జాల కృష్ణమోహనరావు. సెప్టెంబర్ -2011
3. మధుర భక్తి-ముగ్ధ భక్తి - డా.సురవరం పుష్పలత, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు - 1993.
4. అన్నమాచార్యులు-భారతీయ వాగ్గేయ కారులు (తులనాత్మక అధ్యయనం) - ఆచార్య కె.కుసుమారెడ్డి, హైదరాబాదు. 2007.
5. అన్నమాచార్య మిషన్- బులెటిన్ వాల్యూం-1 - కామిశెట్టి శ్రీనివాసులు, 18. మే. 2000.
6. తర్కం - శాస్త్రీయ విధానం. తెలుగు అకాడెమి 1986.


డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య

7. పురందరదాసు – ఆంగ్ల గ్రంథం – శిష్టా రాజేశ్వర శాస్త్రి, తి.తి.దే ప్రచురణ, 2015.

8. పురందరదాసు – డా.ఎస్.గంగప్ప, తి.తి.దే ప్రచురణ, 1993.

9. బ్రహ్మసూత్ర శాంకర భాష్యం (అద్వైతం) డా.పుల్లెల రామచంద్రుడు, హైదరాబాదు, 2000.

10. నవవిధ భక్తులు, శ్రీ జయదయాళ్ గోయెంకా, గీతా ప్రెస్, గోరఖ్పూర్, 2007.

11. పదకవిత–లోకజ్ఞత, డా.పుట్టపర్తి నాగ పద్మిని, ఆం.ప్ర.ప్రభుత్వం, 2012.

12. తి.తి.దే వారి తాళ్ళపాక ప్రచురణలు – 29 గ్రంథాలు (ఆధ్యాత్మిక, శృంగార కీర్తనలు)

13. అంతర్జాలంలో ఉన్న వివిధ వ్యాసాలు

-000-

**శ్రీమత్ త్వదీయ చరితామృత మన్నయార్య। పీత్వాపినైవ సుహితా మనుజా భవేయు**

**త్వం వేంకటా చలపతే రివ భక్తి సారం । శ్రీ తాళ్లపాక గురుదేవ నమో నమస్తే**

**దాసోహం అన్నమార్య శ్రీ గురువరేణ్యం తిరు వేంకట చరణాంకిత పద కవితా సుధార్ణవం**

**నందకాంశ సంభూతం నారాయణార్య సుతం తిరునగేశ మంత్ర హితం వైష్ణవ జనమహోన్నతం**

**మన్మనోభీష్ట వరదం సర్వాభీష్ట ఫలప్రదం – పురందర గురుం వందే దాస–శ్రేష్టం దయానిధిం**

**జ్ఞాన వైరాగ్య సంపన్నం భక్తి మార్గ ప్రవర్ధకం । పురందర గురుం వందే దాస–శ్రేష్టం దయానిధిం**

డా.టేకుమళ్ళ వెంకటప్పయ్య